
విపుల కథానిధి
విపుల




అంగ్లంలో అనర్గళంగా మాట్లాడటం నేర్పే సులభమైన, సరళమైన పద్ధతి

# "రేపిడెక్స్" ఇంగ్లీష్ స్పీకింగ్ కోర్స్




పెద్ద సైజులో
**408** పుటలు
వెల: రు. **18-00**
తపాలా ఖర్చులు:
రు. **5-00**

## రేపిడెక్స్ పద్ధతి:—

నిత్య వ్యవహారంలో ఉపయోగించే ఆంగ్ల భాషను క్రమబద్ధమైన పద్ధతిలో చదువుతూ నేర్చుకునేందుకు, అర్థం చేసుకునేందుకు ఒక సహజమయిన, సులభమైన పద్ధతి...ఎలాగంటే చిన్నపిల్లలు బడికి వెళ్ళకముందే ఇంట్లోనివారి మాటలు విని సంభాషించటం నేర్చుకున్నట్టు అన్నమాట.

## దిగువ పేర్కొన్న యువతీ-యువకులు, స్త్రీ-పురుషుల కోసమై

* అండర్ గ్రాడుయేటయి కూడా ఇంగ్లీషు మాట్లాడటానికి సంకోచించేవారు.
* ఇంటర్వ్యూలో అనుత్తీర్ణులయినవారు, మంచి ఉద్యోగాలు రానివారు.
* కళాశాలలో, సంఘంలో, క్లబ్బులో ఆధునిక యువతీ యువకులతో కలిసి మెలిసి తిరుగలేక పోతున్నవారు.
* బాగా చదువుకున్న పక్కింటి గృహిణులతో, మిత్రులతో లేదా ఇతర నాగరిక కుటుంబ సభ్యులతో కలిసి మెలిసి తిరుగలేనివారు, ఇంగ్లీషు కాన్వెంటులలో చదివించలేని తల్లిదండ్రులు తమ పిల్లలను ఇంటివద్ద చదివించి యోగ్యులుగా చేసేందుకు ఇది అత్యంత సహాయకరమైనది.
* వ్యాపారి లేదా కొట్టు యజమాని ఏ అధికారితోను స్పష్టంగా మాట్లాడలేకపోతే, చదువున్న వ్యక్తికి ఉద్యోగమిచ్చి సరిగా పని చేయించుకోలేకపోయినచో ఇది నిస్సందేహంగా సహాయపడుతుంది.

—అంతే కాదు జీవితంలో ప్రతి మెట్టుకు పునాది
"రేపిడెక్స్ ఇంగ్లీష్ స్పీకింగ్ కోర్స్"
విజయానికి గ్యారంటీ!

> డబ్బు వాపసు గ్యారంటి
> మీకు 'రేపిడెక్స్ కోర్సు' సంతృప్తిని కలిగించకపోతే పుస్తకాన్ని తిరిగి పంపండి. తపాలా ఖర్చులు మినహాయించుకొని, మిగిలిన పైకమంతా మీకు పంపిస్తాము.

'రేపిడెక్స్ కోర్స్' అన్ని పుస్తకాల దుకాణాలలోను, బస్సు స్టాండులలోను, రైల్వే స్టేషను మరియు విమానాశ్రయాల్లోని బుక్ స్టాల్సులోను దొరుకుతుంది.

## రేపిడెక్స్ కోర్స్‌లోని ప్రత్యేకతలు:—

* సరియైన ఉచ్చారణ కోసమై పాఠాలన్నీ ఇంగ్లీషు లోను, మరియు తెలుగు లిపిలో కూడా ఉన్నాయి.
* ఏ భాషనైనా నేర్చుకునేందుకు ఇంతవరకు జాతీయ, అంతర్జాతీయ పరిశోధనల ఆధారంగా తయారు చేయబడిన మొట్టమొదటి కోర్స్.
* సుమారు 2500 కు పైగా నిత్యం ఉపయోగించే ఇంగ్లీషు పదాలు, మీ ఝంఝాటనను పూర్తిగా పారద్రోలుతాయి.
* సుమారు 4500 కు పైగా చిన్న-చిన్న సంభాషణా వాక్యాలు--అంటే,
* ఇంట్లో లేదా కార్యాలయంలో, కళాశాలలో, లేదా క్లబ్బులో, విందులో లేదా సంఘంలో...
* ప్రేయసీ-ప్రియులు, ఆలు-మగలు, అధికారి- గుమస్తా, వ్యాపారి-కొనుగోలుదారు, పెద్ద-చిన్నతో...
* ప్రియ సంభాషణలు, అభివందనము, అభినందనము, ప్రోత్సహించుట, ఓదార్చటంలో ..
* మానసికానందం, ఆరోగ్యం, అన్న-పానీయాలు, వేష-భూషణాలు, సామాజిక-రాజకీయ ప్రసంగాలు...
* టెలిఫోనులో, ఎదుటి మనిషితో, సభలో లేదా ప్రత్యేక సందర్భంలో...

— అంటే ఏ విషయం గురించయినా...ఏ అంతస్థు స్త్రీ-పురుషులతోనయినా...సరైన పద్ధతిలో నిస్సంకోచంగా, ఇంగ్లీషులో మాట్లాడేందుకు అవసరమైన సంభాషణలు.

"రేపిడెక్స్ ఇంగ్లీష్ స్పీకింగ్ కోర్స్" విజయానికి గ్యారంటీ!



ప్రకాశకులు :
పుస్తక్ మహల్, ఖారీ బావులీ, ఢిల్లీ-6.
PUSTAK MAHAL KHARI BAOLI, DELHI-110006

R,APIDEX' COURSE AVAILABLE AT : BANGALORE :- Bangalore Book Bureau, Subedar Chet Ram Road. Subash Stores, Avenue Road, HYDERABAD :- Book Selection Centre, Rajkamal Book Centre VIJAYAWADA :- Navodaya Publishers, Eluru Road Sree Venkateshwara Book Depot, Eluru Road, New Students Book Centre, Eluru Road VISAKHAPATNAM :- Gupta Bros Books, Main Road, Book Centre, Main Road NELLORE :- Sri Srirama Students Emporium, Trunk Road, ALSO AVAILABLE at all leading book shops, Roadways Book Stalls, A. H. Wheeler's & Higginbothams Railway Bookstalls throughout South India.

## తాజా 'కాలమ్'

# మూడే మార్గాలు: మొరార్జీ, చరణ్‌సింగ్ లేదా మధ్యంతర ఎన్నికలు...



"అమీ తుమీ" : ఫైనల్ రవుండ్

పదవికోసమే పార్టీ నాయకత్వానికి అంటిపెట్టుకున్న మొరార్జీ- దానికోసమే పార్టీని చీలదీసి వెలుపల నుంచి సాధించ బూనిన చరణ్‌సింగ్- యీ యిద్దర్నీ పెట్టుకుని ఒక "ఆట" ఆడించగలమన్న ఆశతోవున్న రెండు కాంగ్రెసు పార్టీ గ్రూపులు "ఫైనల్ రౌండ్"కి వచ్చాయి. (జూలై 23) అందుకే గడుసుతనంగా రాష్ట్రపతి నీలం సంజీవరెడ్డిగారు పై ఇద్దర్నీ కూడా కాగితాలమీద "మీమీ మద్దతుదార్ల "నిశానీ" పంపితేతప్ప యిద్దర్లో యెవర్ని "కికేసేది" తేల్చుకోనంటూ చెరో జాబు రాసేయడంతో 16 ఆదివారం నుంచి 22 ఆదివారందాకా తెగిన గాలిపటం లాగా కొట్టుకుపోతున్న ఢిల్లీ రాజకీయ కల్లోల అయోమయ స్థితి- ఓ మలుపు' తిరిగింది !

ఈ యిద్దరిలో ఒక్కర్ని ఎంచుకోలేని స్థితిలో పార్లమెంటు వుండిపోయి "ఉయ్యాల రాజు"గా ఆట సాగితే దేశానికి మధ్యంతర ఎన్నికలే గతి— ఇందులో ఒకర్ని ఎన్నుకున్నా రెండో వారు మొదటి వాని అంతు చూడటం ఖాయం కాంగ్రెస్ (ఐ) కూడా చరణ్‌కి మద్దతు యిస్తాననడంతో వామపక్షాల గొంతులో పచ్చి వెలక్కాయ పడ్డట్టయింది.

అసలు చరణ్‌సింగ్ జనతా పార్టీని చీల్చిందే ప్రధానమంత్రి పదవి కొసం— అట్లాంటప్పుడు రాష్ట్రపతి లాంఛనంగా బ్రిటీష్ పద్ధతిలో ప్రతిపక్ష నాయకుడు వై. బి. చవాన్‌ని పిలిచి ప్రభుత్వం ఏర్పాటు చెయ్యమనగానే— వరేసేను మళ్ళీ "డెప్యూటీ ప్రయిమ్ మినిష్టర్"ని అవుతాను అని చౌధురిగారు కాంగ్రెసుతో చేతులు కలుపుతాడనియెవ్వరూఊహించలేదు —వారం రోజులైంది. ఆపద్ధర్మ ప్రభుత్వం కేంద్రంలో పరిపాలిస్తూ వుండి... చవాన్ గారు తన అశక్తతను ప్రకటించడం ఒక్కటే చెప్పుకోదగ్గ పరిణామం. అదితప్ప గ్రూపుల మధ్య, గ్రూపు నాయకుల మధ్య చర్చలు సంప్రదింపులు—సమాలోచనలు బేరసారాలు అలా నిరంతరంగా కొనసాగుతూనే వున్నాయి కాని "అంతా వేడితప్ప వెల్తురు చూర" కనపడలేదు.





ప్రయత్నలోపం చెయ్యని ధీరులు

## మొండి మొరార్జీ

ఐతే మొరార్జీగారు మొండి పట్టుదల దూరాలోచనగలది గానే కనపడ్డది. జనతా పార్టీలో వున్న 216 మందిలో 90 మంది జనసంఘం వాళ్ళు త్రాసును యెటు పడితే అటు దింపగలరు కనుక — పైగా చదరంగంలో 'గుర్రపు ఎత్తు' లాగ — పార్టీ అధ్యక్షుడు చంద్రశేఖర్ బహిష్కరించటంతో —జగ్జీవనరామ్ గారు — తన కున్నదంతా వెలుపల సానుభూతి బలం తప్ప — లోపల సంఖ్యా బలం కాదని గ్రహించి- జులై 22 సాయంకాలం— మొరార్జీభాయ్ దేశాయ్‌కి నేను "అడ్డం" రానని పలుందాగా ప్రకటించడంతో— యిప్పుడు రంగంలో (216) బలంతో జనతాపార్టీ యించుమించు అంత మందిని మాత్రమే కూడగట్టుకోగల చరణ్‌సింగ్ జనతాలు "గోదా"లో మిగిలాయి! ఇది కూడా ముఖ్య పరిణామమే ! (జూలై 23) రాజ్‌నారాయణ్ లాంటి "ఉపగ్రహమే"దీ తనకు లేదు కనుక శ్రీ 'రామ్'— దుడుకు

(50వ పేజి చూడండి)




ఉపయోగించుటకు మునుపు ★ ఉపయోగించిన తర్వాత ★ ఉపయోగించుటకు మునుపు

## అనారోగ్యులు అభాగ్యులు

మీకు విశాలమైన ఛాతీ, దృఢమైన శరీరం, మంచి తూనిక గలదా? లేకుంటే వెంటనే **'జీవన్‌టోన్'** ఉపయోగించుట మంచిది. మీరు ఒక పౌండు జీవన్‌టోన్ కొన్నారంటే మీ శరీరం దృఢమై, తూనిక అధిక మగుటకు మేము గ్యారంటీ ఇవ్వగలము.

## ఆరోగ్యమే భాగ్యము

నిజమే ఆరోగ్యమే భాగ్యము. ఆరోగ్యం బాగా వున్నట్లయితే డబ్బును సంపాదించడం అసాధ్యమేమీ కాదు! లేకుంటే.... జీవన్‌టోన్ సాధారణమైన వ్యక్తులకు వచ్చే వ్యాధులను ఇట్టే బాగుచేయగలదు. మీరు మీ వయసుకన్న అధిక వయసుగలవారిలా గోచరిస్తున్నారా? అలాగైతే వెంటనే ఉపయోగించడం ప్రారంభించండి **'జీవన్‌టోన్'**. మీకు తగినంత ఆరోగ్యం, దృఢకాయం, తూనిక సమకూరిన వెంటనే జీవన్‌టోన్ ఉపయోగించుట ఆపుచేయాలి.
కాగా దేహానికి బలం సమకూర్చడానికి, తూనిక అధికరించడానికి జీవన్‌టోన్‌లో కొన్ని విశేషమైన మూలికలను చేర్చబడి యున్నవి. కాని ఇందులో జంతువుల క్రొవ్వు చేర్చబడి యుండలేదు. ఒకవేళ ఇంతకుమునుపు అలవాటు వున్నట్లయితే

స్పెషల్ జీవన్‌టోన్ పెద్ద శీసాలు అన్నిచోట్ల సులభంగా లభించగలవు. (వ్యాయామం అవసరంలేదు.) కొనసాగించవచ్చు.
వెల : **454** గ్రాములు (1 పౌండు రు. **18/-**)
సెల్‌బాయిల్ మరియు సెల్ఫో పౌడర్ : వయసుకు వచ్చినవారికి మాత్రమే వెల : రు. **24-00** (ఉభయులకు)
స్కిన్ వీక్సు : మొటిమలను తొలగించి మీ ముఖమును సుందరముగా తేజోవంతముగా నుంచును. వెల : రు. **20-00**

క్రింది చోట్లయందు లభించగలవు : వరంగల్ : ఆయుర్వేద రసాయనశాల, జె. పి. ఎన్. రోడ్డు ఆయుర్వేద మెడిసిన్ ఆయుర్వేద ఇన్‌గ్రిడియన్స్, ఎస్. ఎ. రోడ్డు. మచిలీపట్నం : ఉమామహేశ్వర ఆయుర్వేదిక్ ఏజెన్సీస్, తెనాలి : గుడివాడ హనుమంతరావు & సన్స్. హైదరాబాద్ : ఆయుర్వేద్ మెడికల్‌హాల్, కోఠి, బస్‌స్టాండు ఎదుట, సంపత్ & కం., పంజగుట్ట, జైరాం మెడికల్స్, కోటి, బ్యాంక్ రోడ్డు, వసంత్ మెడికల్‌స్టోర్స్, 4-4-293, బ్యాంక్‌రోడ్డు, మహేశ్ మెడికల్‌హాల్, క్లాక్ టవర్ ఎదుట, విష్ణుమెడికల్ హాల్, గుల్జార్‌హౌస్. ఇచ్ఛాపురం : జనతా మెడికల్‌స్టోర్స్. పర్లాకిమిడి : పి. ధర్మనారాయణమూర్తి & సన్స్. కాశీబుగ్గ : తంగుడు నారాయణమూర్తి. టెక్కలి : టి. ఎన్. ఎన్. మూర్తి. పార్వతీపురం : పద్మిని మెడికల్ స్టోర్స్. పాలకొండ : సూర్య డ్రగ్ హౌస్. శ్రీకాకుళం : పట్నాల సత్యనారాయణ అండ్ సన్స్, పాలచెట్టు స్ట్రీట్. విజయనగరం : ఘట్టుల లింగప్రసాదరావ్ మైన్‌రోడ్డు. విశాఖపట్నం : నీలమ్ & కం., ఎ.వి. ఎన్. కాలేజి రోడ్డు, డా. జె.ఎ. శాస్త్రి, సూర్యాబాగ్‌జంక్షన్. రాజమండ్రి : ఈశ్వరదాస్ & కం., జైహింద్ బిల్డింగ్. గుంటూరు : ఆంజనేయ మెడికల్స్, జిన్నా టవర్‌సమీపం. శ్రీ సత్యనారాయణ ఏజెన్సీస్. కాకినాడ : లక్ష్మీనారాయణ కంపెనీ. విజయవాడ : శ్రీ ధనలక్ష్మి మెడికల్‌స్టోర్స్, సూర్యా మెడికల్ స్టోర్స్, పార్కురోడ్డు. అనకాపల్లి : కాసుమంచి అప్పలరాజు. మదనపల్లె : హయగ్రీవ షాప్, 10-75 నెహ్రూస్ట్రీట్. నెల్లూరు : కె. ఎస్. రావ్ & సన్స్, ట్రంక్‌రోడ్డు. సూర్యాపేట : కమర్షియల్‌సూర్య నివాస్— 2 టవున్ పోలీస్‌స్టేషన్ ఎదుట. సికింద్రాబాద్ : జ్యోతిమెడికల్‌హాల్ 28. ఎమ్. జి. రోడ్డు, డి. జె. ఏకబ్ & కంపెనీ, సుభాష్‌రోడ్డు. జామ్మాపేట, ఫారదాస్టోర్స్, 3106 రాష్ట్రపతిరోడ్డు. కావలి : డా. మల్లేశ్వరరావ్, ఆర్.ఎమ్.పి. మెస్సర్స్ సుగుణ ఆయుర్వేద ఆలయం. రాపల్లె : రామకృష్ణ మెడికల్ అండ్ జనరల్ ఏజెన్సీస్, రైల్‌పేట. తాడేపల్లిగూడెం : కల్యాణరామ ఆయుర్వేద వైద్యశాల, మామిడివారిస్ట్రీట్, వోవర్ బ్రిడ్జి సమీపం. కందుకూరు : సుబశెట్టి వెంకటేశ్వర్లు మెడికల్ స్టోర్స్. తిరుపతి : తారిగొండ మెడికల్స్, 247-బి, సరోజినిరోడ్డు. అనంతపురం : డి. సోమనాథశాస్త్రి, మునిసిపల్‌కులోని. రామచంద్రపురం : రూపా మెడికల్‌స్టోర్స్, మునిసిపల్ మార్కెట్టు, సుభాష్ రోడ్డు. అనంతపురం : కో-ఆపరేటివ్ సెంట్రల్ సొసైటీ లిడ్, రైల్వేస్టేషన్ సమీపం. పులివెందుల : శ్యామల మెడికల్ స్టోర్స్, మైన్‌బజార్. హిందూపురం : కె. ఆర్. భాస్కరయ్య & సన్స్, మైన్ బజార్. బాలాజీ మెడికల్ సెంటర్, మైన్‌బజార్. ఆదోని : కమలాపుర్ గోవిందశెట్టి, ఆర్. ఎమ్. సి. కమలాపుర్ నాగయ్యశెట్టి & సన్స్, కొత్తగూడెం : వరేంద్రుల శంకరయ్య & సన్స్. ధర్మవరం : శ్రీ నంజుండేశ్వర మెడికల్‌స్టోర్స్, మైన్‌బజార్. గుంతకల్లు : గోపాల్ మెడికల్‌స్టోర్స్. జంగారెడ్డిగూడెం : జేడి వెంకటరావ్. రాయదుర్గం : శ్రీ లక్ష్మీవెంకటేశ్ మెడికల్‌స్టోర్స్. తాడిపత్రి : కృష్ణ మెడికల్స్, మైన్‌రోడ్డు. గోరంట్ల : వెంకటేశ్వర మెడికల్ స్టోర్స్, హిందుపురం పోస్ట్. కర్నూలు : శ్రీ రామకృష్ణ మెడికల్‌హాల్, 52/19 బాస్టియన్‌రోడ్డు. గుత్తి : డి. ఆర్. రాజాశెట్టి & సన్స్, మైన్ బజార్. షామిడి : ఎన్. సి. చిన్నప్పశెట్టి. కడప-1 : శ్రీ సాయిరామ్ ఆయుర్వేదిక్ మెడికల్స్, 13/348 మనిరావ్‌స్ట్రీట్. గిద్దలూరు : ఎమ్. సాంబయ్యశాస్త్రి అండ్ సన్స్. అన్ని మెడికల్‌స్టోర్స్ అండ్ బుక్ సెల్లర్స్.
అత్యధిక విక్రయందార్లు : మెసర్స్. బాలాజి కెమికల్ వర్క్స్, ఎ. పి. ఐ. ఇ. 5 వ రోడ్డు, బాలనగర్, హైదరాబాద్—37. ఫోన్ : 269490.
పైపేర్కొనబడిన తయారీలు మీ వూరియందు లభించనట్లయితే దయచేసి రు. 5—00 మాకు పంపిన మీకు వి. పి. పి. ద్వారా పంపగలము.

**మెసర్స్ : జీవన్‌టోన్ ప్రోడక్ట్స్, 17/1, కేంబ్రిడ్జి రోడ్డు, అలసూరు, బెంగుళూరు-560 008.**




**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938 -1972]
శుక్రవారం · 10 8 '79
సిద్ధార్థినామ సం. శ్రావణ బ. తదియ
**సంపుటము 72 : సంచిక 48**

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41-60
అరు మాసాల చందా రు. 20-80
విడి ప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003

## విషయానుక్రమణిక

## గాంధీ అకాడెమీ నూతనాధ్యక్షులు !

గాంధి విజ్ఞాన పత్రికా సంపాదకుడు శ్రీ కె. ఎస్. ఆచార్యులు గాంధియన్ స్టడీస్ అకాడమీ అధ్యక్షులుగా ఎన్నికయ్యారు. విఖ్యాత సర్వోదయ నాయకులు శ్రీ ప్రభ కర్‌జీ మరణంవల్ల ఏర్పడిన ఖాళీలో శ్రీ ఆచార్యులు అధ్యక్షులుగా ఎన్నికయారు. శ్రీ ఆచార్యులు గొప్ప విద్యావేత్తలు. గాంధిజీసిద్ధాంతాల ప్రవక్త, వేదాంత విద్యాపారంగతులు. డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ ప్రథమ శిష్యులలో ఒకరు. సేవాగ్రామ్ విద్యా విధానంలో ప్రత్యేక కృషి చేసిన వారు. పండిత వంశంలో జన్మించినవారు. డాక్టర్ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యుల కనిష్ఠ సోదరులు.

## సుందరకాండ గేయ కవిత :

ఆ వాల్మీకి శోకం ఏ ముహూర్తంలో శ్లోకత్వం పొందిందో గాని రామకథ వివిధ భాషలలో, వివిధ దేశాలలో నేటికీ – ఎందరు కావ్యంటున్నా, ఎందరు పఠిస్తున్నా, ఎందరు పుక్కిటి పురాణమంటున్నా, ఎందరు సగానికి సగం ప్రక్షిప్తమంటున్నా – కొత్త బాణిలో, కొత్త సాహిత్య ప్రక్రియలో చిలవలు పలవలుగా అల్లుకుపోతున్నది. ఈ దశాబ్దంలో తెలుగులో నాకు తెలిసి సంపూర్ణ రామాయణాలన్నా వెలువడి వుంటాయి. జూన్ మూడవవారంలో శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలో ఆవిష్కృతమైన శ్రీమద్రామాయణము సుందరకాండము గేయకవిత పరికిత్తది. ఈ ఆవిష్కరణ సభను నిర్వహించిన వారందరూ లాయర్లే. రచయిత శ్రీ సూరంపూడి రాధాకృష్ణమూర్తి. అధ్యక్షత వహించిన శ్రీ ఎం. ఎస్. కె. శాస్త్రి సీనియర్ లాయరు. ఆవిష్కరించిన వారు రాష్ట్ర ప్రధానన్యాయమూర్తి శ్రీ చల్లా కొండయ్య. ప్రశంసించినవారు శ్రీయుతులు పోతుకూచి సాంబశివరావు, విజయరాఘవాచారి లాయర్లు. ఒక్క డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు మాత్రమే లాయరుకానివారు. (బహుశా ఆయన కూడా లా పరీక్షలు ప్యాసయ్యారేమో!) ప్రధానన్యాయమూర్తి శ్రీ కొండయ్య తమ ప్రసంగంలో రామాయణ ప్రాశస్త్యాన్ని, ప్రాచుర్యానికి కారణం సర్వజనీనమైన సౌభ్రాత్రం, సీతాదేవి సౌశీల్యం, రాముని సత్యవాక్య పరిపాలన, హనుమంతుని సేవా తత్పరత, సుగ్రీవుని మైత్రి, శరణాగతి – నమ్మినవారిని రక్షించడం, త్యాగానికి సిద్ధపడడం అని, ఈ మహాగుణాలు ప్రజా హృదయాన్ని ఆకర్షిస్తాయని సుదీర్ఘంగా, సవిమర్శకంగా, విద్వత్పూర్వకంగా ప్రసంగించారు. డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు తమ ప్రసంగంలో తెలుగువారు రామాయణం అమ్మదని అనుకుంటారని అన్నారు. శ్రీ పోతుకూచి సాంబశివరావు న్యాయశాస్త్ర దృష్టితో రామాయణంలోని కిటుకులను, ధర్మసూక్ష్మాలను వివరించారు. శ్రీ విజయరాఘవాచార్యులు రామాయణ పఠనం వల్ల కలిగే ఆనందాన్ని, కవితా సౌందర్యాన్ని గురించి ప్రసంగించారు. రచయిత శ్రీ సూరంపూడి రాధాకృష్ణమూర్తి ప్రసంగిస్తూ, "నేను కవినికాను. ఏదో ఆవేశంతో, భక్తితో రచించాను. దీనిని అవుత్తరాఘు, కర్ణాటక సంగీతవిద్వాంసులు శ్రీ భీమశంకరం స్వరపరిచారు" అని వినయంగా అన్నారు. పిదప శ్రీ భీమశంకరం వివిధరాగాలతో గేయాలను గానంచేస్తూ, సుందరకాండలోని 67 సర్గలకు 67 రాగాలు నిర్ణయించామన్నారు. ప్రారంభంలో శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం అధ్యక్షులు శ్రీ అవ్వా సత్యనారాయణరావు స్వాగతం చెబుతూ, ఆస్తికులు, భారతీయ సంస్కృతి పై ప్రగాఢవిశ్వాసం కలవారు అయిన ప్రధాన న్యాయమూర్తి శ్రీ కొండయ్య ఈ సమావేశానికి అధ్యక్షతవహించడం ఆనందకరంగా ఉన్నదన్నారు. భాషా నిలయం సంయుక్త కార్యదర్శి శ్రీ అక్కిరాజు జనార్దనరావు వందనసమర్పణతో ఆవిష్కరణోత్సవం సమాప్తమైంది.

## పాఠ్యపుస్తకాల కరువు :

జంటనగరాలలోను, రాష్ట్రమంతటా గూడా పాఠ్య పుస్తకాలు దొరకడం గగనమైపోతున్నది. అన్ని పాఠశాలల విద్యార్థులు ఆందోళన చెందుతున్నారు. పెద్దల సంగతి చెప్పనక్కరలేదు. పిల్లలు చదవాలి కదా! కనుక వల్ల బజారు అయినా సరే. 99 రకాల పాఠ్యపుస్తకాలు, కోటి ప్రతులకు పైగా ముద్రించామని, విక్రేతలకు అప్పగించామని రాష్ట్రప్రభుత్వం పాఠ్య పుస్తకాల ముద్రణాలయం డైరెక్టర్ తెలిపారు. కాని, జంటనగరాలలో హెచ్చుమంది పాఠ్య పుస్తకాలు కళికావి కన్నా దొరకడం లేదు. ప్రాథమిక, మాధ్యమిక పాఠ్య పుస్తకాలు కొన్ని దర్శనమిస్తున్నవి. దుకాణదారులు కూడ అందరికీ సరఫరా చేయలేక పోతున్నారు. పదిమందిలో ఒకరికి చిక్కితే ఎక్కువ. కోరినన్ని పుస్తకాలు సరఫరా చేయడం లేదని కూడ ప్రభుత్వంపై వారి ఫిర్యాదు. కొన్ని ప్రాంతాలలో సంయుతే పైచన్న పుస్తకాలు ఏవీ దొరకడమే లేదు.

## తెలుగు విజ్ఞాన సర్వస్వం 14వ సంపుటి :

రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి జులై 7వ తేదీన తెలుగు విజ్ఞాన సర్వస్వం 14వ సంపుటి లలితకళా సంపుటిని రాష్ట్రపతి నిలయంలో ఆవిష్కరించారు. ఈ సందర్భంలో ఆయన తెలుగు భాషా సమితి కృషిని అభినందించారు. ముఖ్య మంత్రి డాక్టర్ ఎం. చెన్నారెడ్డి ప్రసంగిస్తూ, విజ్ఞాన సర్వస్వ ప్రచురణ కృషికి రాష్ట్ర ప్రభుత్వం కూడ తోడ్పడగలదన్నారు. రాష్ట్ర విద్యాశాఖ మంత్రి శ్రీ భవనం వెంకటరామరెడ్డి లలితకళా సంపుటి మొదటి ప్రతిని రాష్ట్రపతికి అందజేశారు. ప్రారంభంలో తెలుగు భాషా సమితి అధ్యక్షులు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి స్వాగతం చెప్పారు. సమితి కార్యదర్శి డాక్టర్ వేమూరి సత్యనారాయణ నివేదిక చదివారు. శ్రీ దేవులపల్లి రామానుజరావు చివరగా కృతజ్ఞత తెలిపారు.

## ఉపశ్రుతి :

ఇటీవల కనిపించలేదే. ఊళ్ళో లేరే? అనడిగాను నెల రోజులుగా కనిపించని మిత్రుణ్ణి. స్కూటర్ పడి ప్రమాదం జరిగితేనో నా అదృష్టవశంలో మృత్యుంజయుడ నౌతున్నాను అన్నారు ఆయన. ఆంధ్ర నిరుద్యోగులు ఇంత ప్రజా భయానేమిటండీ? అని పత్రిక నడిపేవాళ్ళు ప్రక్కనే ఉన్న ఆంధ్రేతరుడు. జీవన్ ధారాలో ప్రఖ్యాతి అన్నారండీ పెద్దలు అన్నారు మరొకరు.

— తిరుమల రామచంద్ర



(గత సంచిక తరువాయి)

మూడు రోజుల పాటు కృష్ణ పరిస్థితిలో ఏ మార్పూ లేదు. ఆందోళనకరంగానే వుంది.

పచ్చి మంచినీళ్ళు కూడా ముట్టుకుండా కూచుంది శిల్ప! ఆమె ధోరణిలోనూ మార్పు లేదు.

ఈ విధంగా వుంటే... ఒకవేళ... ఒకవేళ... కృష్ణకేదన్నా అయితే శిల్పకి పిచ్చెక్కడమో— లేకపోతే... ఆ పైన ఆలోచించలేకపోయాడు అరుణ్.

అరుణ్‌కి కృష్ణ పరిస్థితికి ఆందోళనతో పాటు— శిల్ప ధోరణికి భయం కూడా కలగసాగింది! ఎన్నో విధాలుగా శిల్పని అనునయించ సాగాడు. బతిమాలి అన్నం తినమనేవాడు.

కృష్ణకి స్పృహ వచ్చేవరకూ తనని బలవంతం చెయ్యొద్దని చెప్పింది శిల్ప.

నాలుగో రోజుకి కొద్దిగా కదిలాడు కృష్ణ. కొద్దిగా స్పృహ వచ్చింది. స్పృహ వచ్చి, కళ్ళు తెరవంగానే కృష్ణ నోటి వెంబడి 'శిల్పా' అనే మాటే వచ్చింది.

పెదవులు కదిలాయి. స్పష్టంగా శబ్దం రాకపోయినా శిల్ప 'బాబాయ్' అంటూ ఎదురుగా వచ్చి నిల్చుంది, ఏడుస్తూ.

కృష్ణ కళ్ళల్లో కూడా నీళ్ళు కదిలాయి. ఒళ్ళంతా నొప్పులు. చిత్రవధ! బాధ బిగపట్టుకుంటున్నట్లుగా వుంది మొహం. ఏదో మాట్లాడాలని పెదవులు కదిలించినా మాట పైకి రాలేదు. ఆ రోజంతా సగం స్పృహ వచ్చి, సగం మగతగా వున్నాడు. ఆ తరువాత రోజు ఇంకొంచెం నయమనిపించింది.

"అమ్మా... శిల్పా... నీ పెళ్ళి... ఆగిపో... కూడదు" అతి కష్టం మీద పలికాడా మాటని!

శిల్ప సమాధానంగా ఏడిచింది!

"మీరు దిగులు పెట్టుకోకండి. మా పెళ్ళి ఆగదు. తప్పకుండా జరుగుతుంది..." అరుణ్ అన్నాడు.

అరుణ్‌ని చూసిన కృష్ణ కళ్ళల్లో సంతోషం కనబడింది.

"శిల్ప ... నీది..." అన్నాడు మళ్ళీ నీరసంగా!

గాయాలన్నీ అమితంగా బాధిస్తున్నాయి! యమయాతన పడుతున్నాడు కృష్ణ.



# రాగరేఖలు



సీరియల్

మాధవపెద్ది పుణ్యశీలాప్రసాద్

స్పృహ లేనప్పుడు నొప్పి తెలియదు గనీ, స్పృహ వస్తున్నకొద్దీ, స్పృహలో వున్నకొద్దీ శరీరంలోపల అణువణువూ విపరీతమైన నొప్పిగా వుంది. కదలలేడు. ఏ అవయవమూ స్వాధీనంలో లేదు. పోట్లు, మంటలు, నొప్పులు!

ఎట్లా ఓర్చుకుంటున్నాడో అనిపిస్తోంది చూసేవారికి! చూసేవాళ్ళకి విపరీతమైన బాధతో నిండిపోతోంది మనసు. డాక్టర్లింక ప్రాణ భయం తప్పినట్టే అన్నారు. కానీ మిగిలిన పరిస్థితి ఇంకా కొన్నాళ్ళ తరువాత గానీ చెప్పలేమన్నారు.

కనీసం నెలా నెలన్నర అయినా హాస్పిటల్లో వుండాలన్నారు!

కాలం స్తంభించి పోయింది!

వేరే వ్యాపకమే లేదు – అరుణ్, శిల్ప, మాలక్ష్మిలకు! ఇంటికీ, హాస్పిటల్‌కి తిరగడమే సరిపోయింది. పెళ్ళికొనమని ఇరవై రోజులు సెలవు పెట్టుకు వచ్చాడు అరుణ్.

అది ఈ విధంగా వుపయోగపడింది.

అర్చన పెళ్ళి అరుణ్ స్నేహితుడితో స్థిరపడింది.

పది రోజుల్లోనే పెళ్ళి ఏర్పాట్లన్నీ చేసుకుని, అర్చన, అనిరుధ్‌ల పెళ్ళి యథావిధిగా జరిపించేశారు, అర్చన తల్లిదండ్రులు.

అనుకున్న అరుణ్ పెళ్ళి మాత్రం అనుకున్న ముహూర్తానికి జరగలేదు 'విధి వైపరీత్యం అంటే అదే కాబోలు' అనుకున్నాడు అరుణ్ తను 'రాలేనందుకు చింతిస్తున్నానని' పరిస్థితిని వివరిస్తూ, వాళ్ళకి ఆశీస్సులు ఇక్కడినించే పంపించాడు అరుణ్. అంత విచారంలోనూ అర్చన పెళ్ళి విషయం విని సంతోషించింది శిల్ప. కృష్ణ గూడా సంతోషించాడు. నెలన్నర అన్నారు గానీ, కృష్ణ మూడు నెలల పైనే హాస్పిటల్లో వుండాల్సి వచ్చింది. అరుణ్ సెలవయిపోయాక, తానే బొంబాయి వెళ్ళి మరికొన్నాళ్ళు సెలవు పొడిగించి వచ్చాడు. కొంచెం శక్తి వచ్చాక చెప్పారు కృష్ణకి కుడికాలు, కుడిచెయ్యీ తీసెయ్యాలని. దేనికీ భయపడని కృష్ణ, అన్ని బాధలనీ ఓర్చుకున్న కృష్ణ, అన్నింటికీ ధైర్యంగా నిలబడ్డ కృష్ణ ఈ విషయం విని తట్టుకోలేక పోయాడు దీనంగా ఏడ్చాడు.

తనింక ఇంకొకరి మీద ఆధార పడాలి, ఇంకొకరి మీద ఆసరా లేనిదే జీవించలేడు. అంతకంటే మరణమే నయమనేమో ననిపించింది. డాక్టర్లు, అరుణ్ గూడా ధైర్యం చెప్పారు. విషయం విన్న శిల్ప స్థాణువే అయింది!

చాలా సేపటికి గాని కోలుకోలేకపోయింది! కదిలి కదిలి ఏడిచింది. "ఏట్లాంటి బాబాయికి ఎటువంటి స్థితి పట్టింది?" ఆ తరువాత తనే ధైర్యం తెచ్చుకుని, "విచారించకండి బాబాయ్! నా కుడిచెయ్యి కుడికాలు మీరే. నేనే మీకు కుడిభుజం. మీ భారం నాది. మీకే లోటూ రాకుండా, అసలు 'కాలూ, చెయ్యీ లేవు' అనే భావమే రాకుండా నేను చూసుకుంటాను. భగవంతుడు ఈ మాత్రంగా నైనా మనమీద కరుణ చూపాడు అంతేచాలు...అదే సంతోషం..." అంది కన్నీరు తుడుచుకుంటూ.

*   *   *

కాలూ చెయ్యీ తీసేసి ఆర్టిఫిషియల్ కాలుతో నడవడం నేర్చి, బాగా కోలుకున్నాక డిశ్చార్జి చేశారు కృష్ణని! దానికి నాలుగు నెలలు అయింది దగ్గిర దగ్గిర.

అరుణ్ సెలవయి పోయింది. మళ్ళీ బలవంతాన వెళ్ళి తన డ్యూటీలో జాయిన్ అయాడు.

కృష్ణ కొన్నాళ్ళ జీవితానికి అలవాటైతే గానీ, తనూ మళ్ళీ పెళ్ళి సంగతి ఎత్తగూడ దనుకున్నాడు అరుణ్.

శిల్ప అట్లాంటి మాటలు ఆలోచించే స్థితిలో కూడా లేదు

---

***జరిగినకథ ||*** శిల్పకి బెంగుళూరు లోని కెనరా బ్యాంకులో ఉద్యోగం రాగా, కృష్ణ అక్కడ చేర్పించటానికి వెళ్తుంటే రైలు కోసం పరుగెడుతున్న చిత్రను చూచి అతని మనస్సు గతంలోకి పరుగెడుతుంది. తల్లి ప్రసవ వేదనతో మరణించగా, తన తండ్రి అయిన వెంకట్రావ్‌ను చిత్ర ద్వేషించటం కృష్ణకు చిత్రంగా తోస్తుంది. అవివాహితుడైన తనతో శిల్ప ఉంటున్న కారణంగా ఆమెకు వివాహం జరగదేమోనని బాధపడ్తాడు కృష్ణ. అరుణ్‌తో అర్చనకి పెళ్ళి నిశ్చయమయిందని శిల్పకి చెప్తుంది వైదేహి. అర్చనని పెళ్ళి చేసుకోవటం అరుణ్‌కి గాని, అరుణ్‌ని పెళ్ళి చేసుకోవటం అర్చనకి కాని యిష్టముండదు. అరుణ్, శిల్ప ఒకరి నొకరు ప్రేమించుకుంటారు. చిత్రని పెళ్ళి చేసుకుంటానని ఆమె తండ్రి వెంకట్రావ్‌తో కృష్ణ చెప్పగా, ముహూర్తం పెట్టిస్తాడు. శిల్ప పూర్వ వృత్తాంతం గురించి అరుణ్‌తో చెపుతూ వుంటాడు కృష్ణ. తను ప్రయాణించే రైలులో దొరికిన పాపను తీసుకొని తన ఇంటికి చేరుకుంటాడు కృష్ణ. ఆ పాప మూలముగా కృష్ణ, చిత్రల మధ్య మనస్పర్థలు ఏర్పడతాయి. కొన్నాళ్ళకు చిత్ర మరొకరిని పెళ్ళి చేసుకొంటుంది. శిల్ప పెళ్ళి అరుణ్‌తో నిశ్చయమవుతుంది. ఆ పెళ్ళి పనుల హడావిడిలో కృష్ణకి 'ఆక్సిడెంట్' జరుగుతుంది.

---

వీలయితే హైదరాబాద్‌కి ట్రాన్స్‌ఫర్ చేయించుకోడానికి ప్రయత్నిద్దామనుకున్నాడు అరుణ్ !

కృష్ణని చూడడానికి వచ్చింది అర్చన, భర్తతో వెళ్ళిపోతూ ! వాళ్ళతోనే వచ్చారు వైదేహీ— ఆమె భర్తా గూడా ! అర్చనని చూడడంగానే ప్రాణం లేచి వచ్చినట్టైంది శిల్పకి.

"అర్చూ..." అంటూ అర్చనని కౌగలించుకుని ఏడ్చింది శిల్ప. 'అక్కా' అంటూ తానూ ఏడ్చింది అర్చన. వైదేహిని చూసిన శిల్ప మొహం దించుకుంది.





"అమ్మా శిల్పా" అంటూ ఆప్యాయంగా చేతుల్లోకి తీసుకుంది, వైదేహి శిల్పని.

"ఆంటీ." ఆవిడ గుండెల్లో తల దాచుకుని వెక్కి వెక్కి ఎంతసేపో ఏడ్చింది శిల్ప.

తల్లి వడిలో తల దాచుకున్న సాంత్వన పొందింది. అప్పుడు శిల్ప "ఆంటీ నన్ను... నన్ను.. క్షమిస్తారా ? మీరు. నన్ను క్షమిస్తారా ? నేను మీకు ద్రోహం చేశాను కదూ? మీరు ఎంత మంచిగా వున్నారు? నన్ను ఎట్లా చూసుకున్నారు? ఇంట్లో తిని ఇంటి వాసాలు లెక్కపెట్టినట్టు, నేను మీ ఇంట్లో వుండి... నేను చేసిందేమిటి?..." ఈ మాటలన్నీ పెదవులు దాటి పైకి రాలేదు.

అవన్నీ తెల్సుకుని వైదేహి ఏమంటుందోనని సందేహిస్తున్న శిల్పని అర్థం చేసుకున్నట్లు వైదేహి తనే మాట్లాడింది. "జరిగిందంతా మన మంచికే నమ్మా. నువ్వేం బాధ పడకు. నువ్వు అరుణ్‌కి తగిన దానివి."

"నీకు అన్నిటికీ అండగా మేముంటాము. నువ్వేం దిగులు పడకు" అన్నాడు ఆమె భర్త.

"మీ రెంత మంచి మనసు!..." శిల్ప మాట్లాడలేక పోయింది.

"పదమ్మా బాబాయి గారిని చూద్దాం" అంటూ అంతా లోపలికి నడిచారు.

కృష్ణ పరిస్థితికి వాళ్ళు కూడా చలించి పోయారు. కళ్ళ నీళ్లొచ్చాయి ! వాళ్ళని చూసి చాలా సంతోషించాడు కృష్ణ. మర్యాదపూర్వకంగా మాట్లాడాడు వాళ్ళతో.

"అర్చనని— అనిరుధ్‌ని మీకు చూపించాలని తీసుకు వచ్చాం" అన్నారు వైదేహీ ఆమె భర్తా ! అర్చన భర్తతో కృష్ణకి నమస్కరించింది

ఆశీర్వదించాడు కృష్ణ. శిల్ప మీ పిల్లే ననుకుని, వస్తూ పోతూ వుండమన్నాడు వాళ్ళతో ! అర్చనకు తగిన భర్త అనిరుధ్ అనుకున్నారు కృష్ణ, శిల్ప కూడా !

అనిరుధ్ కూడా బాగా కలిసి పోయాడు అందరితో ! కూతురి పెళ్ళి అయాక వైదేహి చాలా ఆనందంగా వుంది.

అనిరుధ్ అరుణ్‌కి ఏ విధంగానూ తీసిపోడు. మళ్ళీ మాట్లాడితే అనిరుధ్ ఇంకా ధనాదికుడు. రెండు మూడు రోజులుండి వెళ్ళారు వాళ్ళు. శిల్ప పెళ్ళికి వస్తామనీ. పెళ్ళి దగ్గరుండి జరిపిస్తామనీ, కన్యాదానం కూడా తామే చేస్తామని మరీ మరీ చెప్పి వెళ్ళారు వాళ్ళు !

## 24

రోజులు గడుస్తున్నాయి. కృష్ణకి ఆర్టిఫిషియల్ కాలితో నడవడం అలవాటవుతోంది. ఎడం చేతితో దాదాపు పనులన్నీ చేసుకోవడం నేర్చుకుంటున్నాడు. శిల్ప మాత్రం కన్నీళ్ళు పెట్టుకోవడం ఇంకా మానలేదు. "ఎట్లా వుండే బాబాయ్ ఎట్లా అయిపోయాడు !" అనుకునేది పదే పదే !

* * *

ఆరు నెలలు గడిచాయి. శిల్ప కంటికి రెప్పలాగా చూసుకుంటోంది కృష్ణని. కృష్ణ కాలేజీకి వెళ్ళి వస్తున్నాడు శిల్ప కూడా ఉద్యోగానికి వెళ్ళి వస్తోంది ఆంధ్రా బాంక్‌లోనే హైదరాబాద్ బ్రాంచ్‌కి వేశారు శిల్పని.

ఒకరోజు రాత్రి భోజనం చేస్తూండగా అన్నాడు కృష్ణ.

"మన సిద్ధాంతి గారితో మాట్లాడి ఈ నెలలో ముహూర్తం పెట్టిద్దామనుకుంటున్నానమ్మా-"

శిల్ప మాట్లాడలేదు. మౌనంగా వుండిపోయింది

"ఏమ్మా? ... అనుకోకుండా ... దురదృష్టవశాత్తూ జరిగిన ఈ ఆక్సిడెంటు వలన ... ఆ ముహూర్తం తప్పిపోయింది. లేకపోతే...మీ ఇద్దరూ.. ఈ పాటికి చిలకా గోరింకల్లాగ మా కళ్ళకి విందు చేసేవాళ్ళు."

అప్పటికీ మాట్లాడలేదు శిల్ప.

"పాపం అరుణ్ మంచివాడు కాబట్టి ఇన్నాళ్ళూ ఓపికగా ఆగాడు. నిజంగా అరుణ్ చాలా మంచివాడమ్మా, మనం అదృష్టవంతులం కదూ ?"

అన్నం కెలుకుతూ వుండిపోయింది శిల్ప. వంచిన తల పైకెత్తనే లేదు.

"అసలు నీ పెళ్ళికంటూ నేను ఎక్కువ కష్టపడకుండానే కుదరడం తల్చుకుంటే అంతా ఆ భగవంతుడి ఆశీర్వాదమే అనిపిస్తుంది నాకు. అందులో అరుణ్ లాంటివాడితో...! మీ పెళ్ళయ్యాక, ఇంక నేను మరీ వంటరివాడి నవుతానేమో? కానీ విన్నో కోరిక కోరనా? మొదట పుట్టే మనవడిని నాకు ప్రెజెంట్ చేయమ్మా శిల్పా...!"

శిల్ప మౌనంగానే వుంది. కృష్ణ తాను కూడా కాసేపు మౌనంగా వుండి "ఏమిటమ్మా ఆలోచిస్తున్నావు?" మృదువుగా అడిగాడు.

"బాబాయ్" అని క్షణం ఆగి "నేను పెళ్ళి చేసుకోను బాబాయ్" నెమ్మదిగానే అన్నా స్థిరంగా ధ్వనించాయా మాటలు.

నవ్వబోయిన కృష్ణ శిల్ప మొహంచూసి ఉలిక్కిపడ్డాడు. తన చెవుల్ని తనే నమ్మలేకపోయాడు. శిల్ప పరిహాస మాడటం లేదు. ఆమె ముఖం గంభీరంగా వుంది. కళ్ళల్లో దృఢత్వం కనబడుతోంది. ఆ కళ్ళు సిగ్గు పడడం లేదు. పెదవులు నవ్వు చిలికించడం లేదు.

"అంటే...నిజంగానేనా ..."

"ఏమిటమ్మా- మవ్వనేది?"

"అవును బాబాయ్ నేను పెళ్ళి చేసుకోను. నా జీవితాంతం మీకు అండగా వుండిపోతాను. నాకు ఇంతచేసి, నన్ను ఇంత దాన్ని చేసిన మిమ్మల్ని...మీరీస్థితిలో వుండగా... పెళ్ళి చేసుకుని నా దారి నేను చూసుకోవడం స్వార్థమే అవుతుంది. స్వార్థం కాదు, అది అన్యాయమే అవుతుంది. మీకు సహాయంగా ఒక మనిషి అవసరం. మీరు పెళ్ళి చేసుకోలేదు. అక్కా చెల్లెళ్ళా అన్న దమ్ములూ ఎవరూ లేరు. కనీసం రామయ్య కూడా లేడు. మీ కున్నది నే నొక్కదాన్నే. నేను కూడా మీకు దూరంగా వెళ్ళిపోతే మిమ్మల్ని చూసుకునే దెవరు? మీరు చేసినదానికి ప్రతిఫలంగా నన్ని మాత్రమైనా చెయ్యనీయండి బాబాయ్! ఇది నా సంతోషం... నా ఆత్మ సంతృప్తి... నా మనశ్శాంతి కోసం... అంతే! ప్లీజ్... మీరు కాదనకండి! నన్ను... నన్ను బలవంతం చెయ్యద్దు-"

నోట మాట రాలేదు కృష్ణకి. కళ్ళు చెమర్చాయి. "అమ్మా శిల్పా! నా కెవరూ లేరనే భావన ఎప్పుడూ రాలేదమ్మా నాకు! నువ్వొచ్చాక నా జీవితానికే వెలుగొచ్చింది. నా ప్రాణాలన్నీ నీమీదే! కానీ తల్లీ నువ్వు అవివాహితగా వుంటే అది నా కేవిధంగానూ సంతోషం కలిగించదు. నీ జీవితంలో నేను చెయ్యాల్సింది చెయ్యలేక పోయానే అనే బాధ నాకు మిగిలి పోతుంది. నా మాట విని నన్ను అర్థం చేసుకో తల్లీ!"

"బాబాయ్. మీరు నన్నర్థంచేసుకోండి!"

"అర్థం చేసుకున్నానమ్మా. పెళ్ళయితే మాత్రం నాకు సేవ చెయ్య కూడదనేం వుంది? నేనూ మీ దగ్గిరి కొచ్చి వుండిపోతాను. లేదా మీరూ ఇక్కడే వుండచ్చు... అరుణ్ ఏమీ అర్థం చేసుకోనివాడు కాదు- అడ్డు పెట్టేవాడూ కాదు! అసలతడికి ఇక్కడికి ట్రాన్స్‌ఫర్ కూడా... కాబోతోంది."

"కాదు బాబాయ్ ... మీకు తెలీదు. పెళ్ళితో బాధ్యతలూ వస్తాయి. స్వార్థం పెరుగుతుంది. నా సంసారం, నా పిల్లలూ అంటూ ఏర్పడ్డాక, ఇప్పుడున్నంత ఫ్రీగా వీట్లా వుండగలను? అంత స్వేచ్ఛగా మిమ్మల్నెట్లా చూసుకోగలను? ... అసలు మీరు మామూలుగా వున్నప్పుడే నాకు పెళ్ళి చేసుకుని మిమ్మల్ని వదిలి వెళ్ళాలంటేనే బాధగా వుండేది. అదీ ... ఇప్పుడు ... మీరీ స్థితిలో వుండడం తెలిసీ...నేను చెయ్యగలిగే

# రాగరేఖలు

దేవన్నా వుంటే ... అది ... అది ... ఇదొక్కటే...!"

"నువ్వేం బాధపడకమ్మా ... నీకు నీ సంసారం అంటూ ఏర్పడ్డాక కూడా, నేను, నాకు నీ సేవలు అడిగి మరీ చేయించుకుంటానుగా? సరేనా? నీ పిల్లల్లో ఒక పిల్లవాడిగా నన్ను చూసుకుందువుగాని."

"క్షమించండి బాబాయ్ ... ఈ విషయంలో మాత్రం బలవంత పెట్టకండి. నిన్నాళ్ళనించో ఆలోచించుకుని చేసుకున్న నిర్ణయం ఇది !"

"చూడమ్మా... ఇంత దూరం వచ్చాక మనం కాదంటే ... అరుణ్ ఎంత బాధపడతాడో ఆలోచించావా? బాధపటడంకాదు పిచ్చి వాడవుతాడేమో కూడా ! నా కంటే అరుణ్ విషయం నీకే ఎక్కువ తెలుసు. నిన్నెంతగా ఇష్టపడి చేసుకుంటున్నాడో మరెవ్వర గంది కాదుగా? తొందరపడి ఇట్లాంటి నిర్ణయాలుతీసుకోకూడదమ్మా. ఇది నీ ఒక్కదాని జీవితమేకాదు, ఇప్పుడు అరుణ్ జీవితంతోనూ ముడిపడి వుంది. ఈ నిర్ణయం ఆతడి మీదెంత దెబ్బ తీస్తుందో! నువ్వు వూహించను కూడా లేవు చిన్న పిల్లవి. నీకు తెలీదు."

"అరుణ్‌కి నేను నచ్చచెప్తాను బాబాయ్. అతడికి చెప్పేవిధంగా చెప్తే వింటాడు"

"శిల్పా...చెప్పిన మాట వినమ్మా..." బాబాయ్‌కి కోపం వస్తోందని గ్రహించిన శిల్ప, ప్రస్తుతానికి మౌనంగా వుండి పోయింది.

## 25

అ తరువాత రోజే అర్జంటుగా రమ్మని అరుణ్‌కి టెలిగ్రాం ఇచ్చాడు కృష్ణ.

కృష్ణకి శిల్ప మాటలతో మనశ్శాంతి కరువయింది. తన పెళ్ళి లాగే శిల్ప పెళ్ళీ ఆగిపోతుందేమోనని భయం పట్టుకుంది.

తక్షణం అరుణ్‌ని పిలిపించి మాట్లాడితే గానీ అతడి ఆదుర్దా తీరేటట్లు కనిపించలేదు. ఏమైనా సరే ఈ పెళ్ళి ఆగకూడదు. ఈ పెళ్ళి జరగకపోతే ఎన్నో నష్టాలున్నాయి.

ఇప్పటికే శిల్పని గురించి, తన గురించీ ఎన్నో అపనిందలు వచ్చాయి. అవి తను గూడా విన్నాడు. శిల్పతో ఆ మాట చెప్పలేక ఊరుకున్నాడు తను! శిల్పకి పెళ్ళంటూ జరగకపోతే ఆ అపనిందలు ఇంకా ఎక్కువవుతాయి. అవి వూహించడానికే అసహ్యం!

ఈ పెళ్ళి జరగకపోతే అరుణ్ జీవితాన్ని నాశనం చేసినట్లవుతుంది తాము ! విరక్తి కూడా పెంచుకుంటాడు అరుణ్. ఈ పెళ్ళి ఆగిపోతే, ఈ సంబంధం తప్పిపోతే ఇంక శిల్పకి సంబంధం కుదరడం, పెళ్ళవడం కష్టం ! తను తిరగలేదు దేనికీ గూడా ! అదీగాక పీటలమీద వరకూ వచ్చిన పెళ్ళి ఆగిపోయిందంటే రకరకాల పుకార్లు బయల్దేరుతాయి !

జీవితాంతమూ పెళ్ళి గకుండా ఆమె వుండిపోతే– తను వుండగా ఫరవాలేదు... ఆ తరువాత వంటరిదై పోదూ– శిల్ప ? అప్పుడు శిల్ప నెవరు చూసుకుంటారు ? ఒంటరి ఆడపిల్ల ఈ లోకంలో బతకగలదా ? అప్పుడు కావాలంటే ఆమెకు తోడు నెవరొస్తారు ? ఇన్నాళ్ళూ తను పువ్వులాగా చూసుకున్నాడు శిల్పని! తన తదనంతరం కూడా ఆమె అట్లాగే చూడబడాలి ! అదే తనకోరిక! అరుణ్ అట్లాగే చూసుకుంటాడు. కోరి వచ్చిన అదృష్టాన్ని కాదనడం అవివేకం! కాబట్టి ఎట్లాగయినా సరే ఈ పెళ్ళి జరిపించి తీరుతాడు తను.

చిన్నపిల్ల ఏదో ఆవేశంలో అంది ఆ మాటలు. తరవాత అన్నీ అవే సర్దుకుంటాయి ! అనుకున్నాడు తరువాత కృష్ణ. అయినా దిగులు, ఆదుర్దా తీరలేదు. అరుణ్ కోసం ఎదురు చూస్తూ కూచున్నాడు కృష్ణ !

## 26

అరుణ్‌కి హైదరాబాద్ ట్రాన్స్‌ఫర్ అయింది. మరో వారంలో జాయిన్ కావాలి.

బయలు దేరదాం అనుకుంటూ వుండగానే కృష్ణ ఇచ్చిన టెలిగ్రాం అందింది. తనకున్న కొద్దిపాటి సామానూ ఇప్పుడే హైదరాబాద్ ఎందుకులే అని, బెంగుళూరు పంపించాడు.

అర్చన పెళ్ళయ్యాక, బెంగుళూరే వెళ్ళలేదు అరుణ్

కృష్ణ దగ్గిర కొన్నాళ్ళు వుండి, ప్రైవ్ కూడా ఎక్కువ లేనందువలన హైదరాబాద్ నించే బొంబాయి వెళ్ళి పోయాడు.

అందుకని ఇప్పుడన్నా ముందు బెంగుళూరు వెళ్ళి, ఒక నాలుగు రోజులు వుండి, ఆ తరువాత హైదరాబాద్ వెళ్దామనుకున్నాడు.

ఇప్పుడు కృష్ణ ఇచ్చిన టెలిగ్రాం వల్ల, నాలుగు రోజులు కాకపోయినా, ఒక రోజయినా వుండి వెళ్దామని, బెంగుళూరు వచ్చాడు అరుణ్.

అనిరుధ్, అర్చనా కూడా అక్కడే వున్నారు, ఏదో పండగ అని !

వాళ్ళతో ఆరోజు వుండి, మళ్ళీ వస్తానని చెప్పి ఆ మర్నాడే హైదరాబాద్ బయలుదేరాడు, అరుణ్ ! ఉన్న ఒక్కరోజూ కూడా అన్యమనస్కంగానే వున్నాడు, ఎందుకిచ్చాడో కృష్ణ టెలిగ్రాం అని !

తను వస్తున్నట్లు బెంగుళూరి నించి కృష్ణకి టెలిగ్రాం ఇచ్చి బయలుదేరాడు అరుణ్ !

అనిరుధ్ స్టేషన్‌కివచ్చాడు, అరుణ్‌తో.

(ఇంకా వుంది)

# వంటలు

## మటర్‌వాలా చావల్

(బఠాని అన్నం)

కావలసిన వస్తువులు :- బంగాళా దుంపలు- 4, కాలీఫ్లవర్- 1, వుల్లి పాయలు- 2, ఏలక్కాయలు- 4, సన్న బియ్యం- అర్ధకిలో, పచ్చి బఠాని - పావు కిలో, లవంగాలు-8, జీలకర్ర, మిరియాలు, దాల్చినచెక్క.

తయారు చేయుట :- మసాలా దినుసులను (జీలకర్ర, మిరియాలు దాల్చినచెక్క, లవంగాలు, ఏలకులు) రోట్లో వేసి మెత్తగా గాకుండా పక్కపక్కలుగా దంచాలి బంగాళా దుంపలను సన్నగా తరుక్కుని నూనెలో వీరగా వేయించి వుంచుకోవాలి. కాలీ ఫ్లవర్‌ను చిన్న చిన్న పువ్వులుగా విడదీసి నూనెలో వీరగా వేయించుకోవాలి బఠానీలను వలచుకుని వుంచుకోవాలి. స్టౌమీది మూకుడులో నాలుగు గరిటల నూనె వేసి కాగిన తర్వాత పక్కలుగా దంచుకున్న మసాలా పొడం వేయాలి. దీనిలో వుల్లి పాయ ముక్కలు వేసి, అవి వేగాక నీళ్ళు పోసి, ఉప్పు వేసి వుంచాలి. అరకిలో బియ్యానికి సరిపడే నీటిని విరవిరలాడేలా మరగనిచ్చి నుండగనే కడిగి వార్చుకున్న సన్నబియ్యాన్ని పోసి స్టౌ కొంచెం తగ్గించి సన్నటి మంట వుండేలా చేసి ఉడకనివ్వాలి. వేయించి వుంచుకున్న బంగాళాదుంపల ముక్కలను, కాలీఫ్లవర్ ముక్కలను మధ్య మధ్యలో వేస్తూ అడుగు అంటకుండా బాగా కలపుతుండాలి. చల్లారిన తర్వాత తింటే రుచిగా వుంటుంది దీనిని "తెహారీ" అని కూడా అంటారు.

— వేంకట సుబ్బమ్మ.

## రైస్ ఆమ్లేట్

కావలసిన వస్తువులు :- బియ్యం- 1 గ్లాసు, సెనగపిండి— 2 టేబిల్ స్పూన్లు, బంగాళాదుంప —ఒకటి, టొమాటో—ఒకటి, మిరియంపొడి-చిటికెడు, వుల్లిపాయ— అర చెక్క, పచ్చిమిర్చి 4 కాయలు, ఉప్పు తగినంత.

తయారుచేసు విధానం :— ముందుగా బియ్యం నానబెట్టుకోవాలి నానిన బియ్యం వడగట్టి, రోటిలో వేసి నీళ్ళు చేర్చుతూ మెత్తగా రుబ్బాలి. బంగాళాదుంప ముక్కలు కూడ పిండిలో వేసి రుబ్బాలి. యిలా రుబ్బిన పిండిలో సెనగ పిండి, మిరియంపొడి, ఉప్పు, మిర్చి ముక్కలు, టొమాటో ముక్కలు వేసి కలపాలి. ఈ పిండిని, పెనంపై నూనె వేసి అట్లుగా పోసుకోవాలి. దీన్లోకి చింతపండు పచ్చడి వుంటే యింకా బాగుంటుంది.

— వల్లి శ్రీ నాగరాజు.

టిన్ను ముందువైపైతే
ఆరోగ్యపానీయమనే
పేరుంటూ వెనకపక్క
'కృతకంగా రుచి
చేర్చబడినది
అని ఉందా?

Artificially Flavoured

# అయితే సహజమైన కోకో, పాలు, మాల్ట్, పంచదారగల రుచికరమైన న్యూట్రామూల్ తాగటం మొదలెట్టండిక

టిన్నును ఒక్కసారి వెనక్కతిప్పి చూడండి. ఏమిటి.
కృతకమైన రుచిగల పానీయాన్ని తాగుతున్నారా ? ఆ
టిన్నుపైన 'Artificially Flavoured' అనిగనక వుంటే,
అది మీ కుటుంబపు ఆరోగ్యానికి అది తగిందా అని ?
ప్రకృతి సహజమైన ఆరోగ్యాన్నిచ్చే
పానీయాన్ని తాగి, ఆ అసలైన ఆనందాన్ని పొందండి-
న్యుట్రామూల్ న్యుట్రామూల్‌లో రుచికరమైన కోకో,
మాల్ట్, పాలు, పంచదార మాత్రమే ఉన్నాయి. ఇందులో
కృతకమైనది ఏమీ లేదు. అందుకే, న్యుట్రామూల్
తాగండి—అసలైన ఆనందాన్ని పొందండి.
న్యుట్రామూల్—అమూల్ వారిది




అమూల్ వారి
**న్యూట్రామూల్** ప్రతి కప్పూ మీకు పోషణను ఇచ్చు

daCunha GCM/6 TEL

# నళిని

# చిట్టారెడ్డి సూర్యకుమారి

**( గత సంచిక తరువాయి )**

భారతదేశం స్వాతంత్ర్యం కొరకు సంవత్సరాలుగా పోరాడి, పోరాడి చివరకు అహింసయనే ఆయుధం ప్రయోగించి స్వతంత్ర్యాన్ని గెలుచుకుంది. బ్రిటిష్ ప్రభుత్వం స్వతంత్ర్యాన్ని ఇచ్చినట్టే ఇచ్చి నిప్పురవ్వను రాల్చిపోయింది. దాని ఫలితంగా భారతదేశం చీలికలైంది. కర్ణుడి కవచాన్ని శరీరం నుంచి కోసి ఇచ్చినట్లు గాంధీగారు ఆ బాధను ఓర్చుకుంటూ తప్పదు కనుక దేశాన్ని విడదీసి ఇచ్చారు. భారతదేశం రెండు ముక్కలైంది.

కొత్తగా ఏర్పరచుకున్న తమ రాజ్యాన్ని ఇస్లాంలు పాకిస్తాన్ అని పిలుచుకున్నారు.

ఆ విడిపోయిన ముస్లిం ప్రదేశాలు భౌగోళికంగా ఏక ఖండంగా లేదు. ఆ మధ్యన 800 మైళ్ళ భారతీయ భూ భాగం వుంది. అందుకని అటు ఇటు ప్రక్క ప్రదేశాన్ని తూర్పు పాకిస్తాన్, పశ్చిమ పాకిస్తాన్ అని విభాగించుకున్నారు.

పశ్చిమ పాకిస్తాన్ ప్రజల సంస్కృతి, తూర్పు పాకిస్తాన్ ప్రజల సంస్కృతి, సాహిత్యం ఆచార వ్యవహారాలు చాలావరకు భిన్నమైనవి. అందుకని పశ్చిమ పాకిస్తాన్‌లో పాలనలో వున్న అధికారులు... అరేబియా, ఇరాన్, టర్కీల నుంచి వచ్చినవారే నిజమైన ముస్లింలు. స్థానిక జాతులు, హిందువులనుంచి మారిన బెంగాలీ ముస్లింలు నిజమైన ముస్లిమ్‌లు కాదు అని పాకిస్తాన్ ప్రభుత్వం భేదం చూపించింది.

మొదటినుండి పాలనలో పక్షపాతం చూపించారు. బెంగాలీ ముస్లిముల సంస్కృతిని భాషను అవమానించారు. బెంగాలీ రచనలు ప్రభుత్వం నిషేధించింది. జనాభాలో తూర్పు పాకిస్తానీలు 55వ శాతమున్నా ప్రభుత్వంలోను, ఉద్యోగాల విషయంలోను చిన్నచూపే చూసింది. చివరికి సైన్యంలోకూడ చేర్చుకోలేదు. పంజాబీలు, పఠానులే సైనికులు. మీరు బెంగాలి సైనికులు. సైనిక జాతి కాదు అని వారి దేశీయులనే, వారి మతస్థులనే, వారి ప్రజనే అవమానించారు. బెంగాలీ ముస్లిమ్‌లు, కొన్ని యుగాలుగా, వారు ఆ దేశంలో వున్నారు. వలస వచ్చినవారు కారు. అలాటి ప్రజలు తమ దేశంలోనే పరాయివారివలె జీవించవలసివచ్చింది.

పాలకుల పరిపాలన అంతంతమాత్రంగా వుంది. ప్రజారాజ్యం లేదు. సైనిక పరిపాలన, నియంత పరిపాలన క్రింద, ప్రజలు నలిగిపోయారు. నలిగిపోతున్నారు. మధ్యతరగతి ప్రజలు కష్టాలకి అవమానాలకి గురైనారు. తూర్పు పాకిస్తానీల సాహిత్యాన్ని సంస్కృతిని ద్వేషిస్తూ, ఉర్దూ భాషను, ఉర్దూ సంస్కృతిని వారిపై బలవంతాన రుద్దటంతో ప్రజలలో ఆందోళన బయలుదేరింది. బానిస బ్రతుకు వెగటు, కోపం రగిలించాయి వారిలో పాలకులను వ్యతిరేకించసాగారు.

ప్రజా ప్రభుత్వం రావాలి. మనల్ని మనమే పరిపాలించుకోవాలి. పశ్చిమ పాకిస్తాన్ కేంద్ర ప్రభుత్వం అధికారంలో వున్నా కనీసం మా రాష్ట్రాలను మేము పరిపాలించుకుంటాము. మాకూ స్వాతంత్ర్యం కావాలి అన్న పిపాస ప్రజలలో బయలుదేరింది. ఆ స్వాతంత్ర్యాభిలాషతో ఒక పార్టీ ఏర్పరచుకున్నారు. ఆ పార్టీయే "అవామీ లీగ్" ప్రియతమ ప్రజానాయకుడు షేక్ ముజిబుర్ రహమాన్. ప్రజలు తమ అసంతృప్తిని వెల్లడిచేస్తూ ఆందోళన ప్రారంభించారు. ఆ వ్యవహారం కాల్పుల వరకు వెళ్ళింది. పశ్చిమ పాకిస్తాన్ ప్రభుత్వాధికారి షేక్ ముజిబుర్ రహమాన్‌ను రాజకీయ ఖైదీగా కస్టడీ చేశారు. సుమారు పది సంవత్సరాలు ఖైదీగా వున్నారు. ప్రజలలో చైతన్యం రగులుకొంది. సర్వ స్వతంత్ర పిపాస పరవళ్ళు తొక్కింది. స్వతంత్ర ప్రజాపాలన కోసం చంద్రోదయానికి ముందు వుప్పొంగిపోయె సముద్రంలా పొంగిపోయారు. ఎంతటి సైనిక పాలకులైనా, ఆ చైతన్యానికి కదలక తప్పలేదు. ఒక నియంతను తొలగించి సైనిక పాలన చేపట్టిన ప్రెసిడెంట్ యాహ్యాఖాన్, ప్రజలు సైనిక నియంతృత్వాన్ని ఇక సహించేలా లేరు అని గ్రహించాడు. తన పాలనకు తిలోదకాలు ఇచ్చుకోవలసివుంటుందని తెలిసివచ్చింది. రాజకీయ చదరంగంలోకి దిగాడు. "వయోజన ఓటింగ్ పద్ధతిపై రాజ్యాంగబద్ధమైన పౌర పరిపాలన ఏర్పాటు చేస్తాన"ని ప్రజలకు హామీ ఇచ్చాడు.

13 సంవత్సరాలు తమని ఏలిన సైనిక పరిపాలన తమకు యిక వుండబోదని ప్రజలు సంబరపడి తమ స్వపరిపాలనకొరకు ఉవ్విళ్ళూరుతూ ఎదురుచూస్తున్నారు. తమ తమ నాయకుల కొరకు ఓట్లనే ఆయుధాలను ఆయత్తం చేసుకున్నారు.

యుద్ధానికి ఆయుధాలను, మందుగుండు సామానును చేర్చుకున్నట్లు ప్రజా యుద్ధానికి ఓట్లను సమకూరుస్తున్నారు. ఓటింగ్ పద్ధతిపై ఎన్నికలు జరిగాయి తూర్పు పాకిస్తాన్‌లో ముజిబుర్ రహమాన్ నాయకత్వాన అవామీలీగ్ పార్టీ బ్రహ్మాండమైన విజయాన్ని సాధించింది న్యాయబద్ధంగా తమ స్వాతంత్ర్యాన్ని చేజిక్కించుకున్నారు.

నియంతలకు ప్రజాస్వామ్యం రుచించదు. సర్వాధికారాన్ని అంత సులువుగా వదలుకోరు. రాజ్య కాంక్ష, పరిపాలనా కాంక్ష, సుఖాపేక్ష ఆ శరీరాన్ని వదిలిపెట్టదు. ప్రెసిడెంట్ యాహ్యాఖాన్ కుయుక్తులు పన్నుతున్నాడు. ఆ రాజ్యాంగం తనకు నచ్చకపోతే రాజ్యాంగ పరిషత్తును రద్దుచేసి సైనిక పాలనను కొనసాగించే హక్కు తనకు వుందన్నాడు యాహ్యాఖాన్.

పశ్చిమ పాకిస్తాన్‌లో భుట్టో పీపుల్స్ పార్టీ ఎక్కువ ఓట్లతో గెలుచుకొంది. కాని తూర్పు పాకిస్తాన్, పశ్చిమ పాకిస్తాన్ ప్రసక్తి లేకుండా తమ ప్రజల ప్రయోజనాలకు అనుగుణంగా రాజ్యాంగాన్ని ఏర్పరచుకొన్నారు. ముజిబ్ పార్టీకి మెజారిటీ వుంటుంది మొత్తం పాకిస్తాన్ అంతా ఆ పార్టీయే పాలించే అవకాశం వుందీ అనుకున్నాడు. పశ్చిమ పాకిస్తాన్ పక్షపాతి. మొత్తం పాకిస్తాన్ పాలించే అవకాశం వుండదు. తూర్పు పాకిస్తాన్ చేయి జారిపోతుందనే భావంలో తనకు ముజిబ్‌కు రాజీ కుదరకుండటమే యాహ్యాఖాన్‌కి కావలసింది.

120 రోజులలో కొత్త రాజ్యాంగం అమలులోకి రాకపోతే నా అధికారం వుంటుందని శరత్ పట్టిన యాహ్యాఖాన్ సంతోషించాడు. షేక్ ముజిబుర్ రహమాన్ 'మీ యుక్తులతో, తంత్రాలతో మాకు పనిలేదు. మీ పశ్చిమ పాకిస్తాన్‌తో మాకు అంతకంటే పనిలేదు' అని కేంద్ర ప్రభుత్వానికి రక్షణ విదేశీ వ్యవహారాలు, కరెన్సీ విషయాలు పూర్తి అధికారాలు వుంటాయి. తూర్పు పాకిస్తాన్ రాష్ట్రాలు, స్వయం పరిపాలన చేసుకుంటాయి అని తీర్మానించారు. ఆందోళనలు, విధ్వంసక చర్యలు జరుగకుండ పాకిస్తాన్ ప్రజలను హెచ్చరించాడు.

పాకిస్తాన్ ఏర్పడిన రోజు మార్చి 23వ తేదీన బంగ్లాదేశ్ స్వతంత్ర దేశంగా అవతరించినట్లు తమ జెండా పచ్చ—ఎరుపు—పసుపు వన్నెని గుర్తులగల తమ జాతీయ పతాకాన్ని ఎగుర వేశాడు.

స్వాతంత్ర్య ప్రియులు హర్షించారు. ముజిబుర్ రహమాన్‌కి జోహార్లు అర్పించారు. పాకిస్తాన్ రెండు ముక్కలైంది. మన పొరుగు రాజ్యం సోదర రాజ్యంతో నవ్వుతున్న చరిత్ర తిరగబడింది.

* * *

నళిని ఎక్కిన రైలు తెలతెల వారుతుండగా సికింద్రాబాద్ స్టేషన్‌లో వచ్చి ఆగింది. రైల్వే కూలీలు రైలు ఆగక ముందే కడ్డీలు పట్టుకొని తలుపులకి వ్రేలాడబడి నిల్చున్నారు. "అమ్మా" అని ఓ కూలి పిలువగా తలూపింది. పెట్టె బెడ్డింగ్—మోచేతికి బుట్ట తగిలించుకొని దిగిపోయాడు.

ద్వారం దగ్గర నిల్చొని ప్లాట్ ఫారమ్ మీద కలయ జూసింది, తన కోసం అన్నయ్య కాని, బావగారు కాని వచ్చి యుంటారని. తను అలా చూస్తుండగా అప్పుడే నిద్ర లేచిన ఓ సేట్ గబగబా పడక చుట్టుకొని వచ్చాడు ఆ సేట్

---

**జరిగిన కథ-3 :** తమ కాలేజీ చదువు ముగించుకొని బయలుపడ్డారు వాసవి, నళినీలు. తరువాత వాసవితోకలసి వాళ్ళవూరు వెళ్తుంది నళిని. అక్కడి ఆహ్లాదకరమైన గ్రామీణ వాతావరణానికి పరవశించిపోతుంది. కొన్నాళ్ళకు ఆ వాతావరణం విసుగుపుట్టగా, బావ మోహన్‌తో కలసి వాసవి, నళినీలు లేపాక్షి వెళ్ళి అక్కడి సుందరమైన శిల్పములను, వాటి చరిత్రను తెలుసుకొంటారు.

---

కంటే ఓ అడుగు ముందు ప్రయాణం చేస్తున్న అతని బొజ్జ నళినికి వచ్చి ఢీ కొట్టింది. అలా తేలిగ్గా నిల్చున్న నళిని తూలి ముందుకు పడింది.

ఆ భయానికి కేక నోటిలోనే వుండగా తన నెవ్వరో బలంగా పట్టుకున్నా రనిపించింది. తెల్లని గోడకి వచ్చి అనుకున్నానా! అని భ్రమ కలిగింది. ఆ గోడకి చేతులు ఆనిచ్చి కళ్లు పైకెత్తింది. ఉత్పల్ల నేత్రాలలోకి చూస్తున్న మరో విశాలమైన నేత్రాలు కనిపించాయి. మీసాల క్రింద ఎర్రని పెదాలు నవ్వుతున్న ట్లున్నాయి. తను అనుకుంది గోడ కాదు. మగవాడి వక్షస్థలం అని గ్రహించి, హరిణిలా తప్పుకొని ప్రక్కకి చూసింది. తన సామాను పట్టుకొని మనుష్యుల్లో కలిసి పోతున్న కూలీని చూసి తనని ఇంకా పట్టుకొని వున్న అతని చేతులను తప్పించుకొని బయటపడి పరుగు లాంటి నడకతో కూలీని వెంబడించింది. చిన్న చిన్న అడుగులతో గబగబ నడిచి పోతున్న నళిని కనిపించేంత వరకు చూశాడు అతను. సన్నని నవ్వు అతని పెదవులపై నడయాడింది. ఆ అమ్మాయి ఎంత తేలిగ్గా పడింది స్పర్శ ఎంత మృదువుగా వుందీ, ఆ స్పర్శానుభావం ఇంకా కావాలనిపించింది. తన పిచ్చి ఆలోచనకి నవ్వుతో పెదాలు వంపు తిరిగాయి. ఏదో జ్ఞాపకం వచ్చి వెను దిరిగాడు.

నళిని తనకోసం ఎవ్వరూ రాలేదని తెలుసుకుంది. హైదరాబాద్‌కి ఒకటి రెండుసార్లు వచ్చిందికాని, ఎప్పుడూ కొత్తగానే వుంటుంది. ఒంటరిగా ఎప్పుడూ రాలేదు. అక్కవాళ్లు వున్నది ఆల్వాల్‌లో. ఎటు పోవాలో, ఎంత దూరం పోవాలో బస్సులో. ఈ సామానుతో పోలేను. ఈ టాక్సీవాళ్లని నమ్మటానికి భయం. బర్కత్‌పురాలో వున్న అన్నయ్య దగ్గరకి పోటానికి నిశ్చయించుకొంది. ఇంకా చీకటిగానే వుంది. వీధులు నిర్మానుష్యంగా కనపడుతున్నాయి. పూర్తిగా తెల్లవారేక ఆటోరిక్షాలో పోవచ్చు అని తీర్మానించుకుంది. ఎవరికోసమో నిరీక్షిస్తున్నట్లు నిలచుంది. రిక్షావాళ్లు, ఆటోరిక్షావాళ్లు అడుగు తున్నారు. వద్దు అన్నట్టుగా తలూపింది. వాళ్లను పట్టించుకోనట్లు మరో వైపుకి చూపు మళ్ళించుకొంది.

లేస్తూనే ఎవ్వరి ముఖం చూసిందో! అతనెవ్వరో పట్టుకోకపోతే, బోర్లాపడిపోయేది. కాలో, చెయ్యో బెణికి, విరిగివుంటే తన పని ఏమయ్యేది. అని నిదానంగా ఆలోచించసాగింది.

ఆ మగవాడి చేతుల్లో సంధింపబడింది. మగవాడి శరీరం ఎంతగట్టిగా వుంటుందో?...ఏదో గట్టిగావున్న వస్తువు పై పడినట్టుంది ... తలచుకుంటే గుండె అదోమాదిరి స్పందించింది.

అతను స్టేషన్ నుంచి తిరిగివచ్చి, స్కూటర్ దగ్గరకి పోబోతూ, ఆ ప్రక్క సామాను పెట్టుకొని నిల్చున్న అమ్మాయిని చూసి, వస్తూనే, ''ఇంకా ఇక్కడే నిల్చున్నారేం? యెవరైనా వస్తారని చూస్తున్నారా? ఎక్కడికి పోవాలి?'' అంటూ ఇంగ్లీషులో ప్రశ్నలు కురిపించాడు. పరిచయస్తుడిలా మాట్లాడుతుంటే అతనివైపు చూడకుండా వుండలేకపోయింది. అతన్ని చూడాలంటే తల కాస్త ఎత్తవలసివచ్చింది. బిరుసైన వెంట్రుకల్ని బాగా దగ్గరగా కత్తిరించిన క్రాప్. తెల్లగా వున్నాడు. విశాలమైన నుదురు. కళ్ళు దీర్ఘంగా వున్నాయి. మెత్తగా చూస్తున్నాయి. పొడుగాటి ముక్కు, పెదాలమీదుగా వత్తుగా వంకరతిరుగుతున్న మీసాలు, పలుచని పచ్చని చెంపలు. పొడుగాటి చేతులు. వెడల్పుగా వున్న భుజాలు. తెల్లని పొడుగుచేతుల చొక్కా, బూడిదరంగు టెర్లిన్ పాంటులో టక్ చేశాడు. వెడల్పాటి బెల్టులో బిగుతుగా వున్న సన్నని నడుము. నల్లగా నిగనిగలాడుతున్న బూట్లు, ఆ మాటల ఉచ్చారణ బాగుంది. ఆ తెల్లవాడు, ఎర్ర పెదాలవాడు ఏ ఉత్తర హిందూస్థానీవాడో! పంజాబీలాగున్నాడు.

నళిని గొంతు బిగుసుకుపోయినట్లు ఒక్క మాట నోటి నుంచి రాలేదు. పెదాలు ముడుచుకొని తడి చేసుకొంది. కళ్లు దించుకొని నర్వస్‌గా వున్న ఆ అమ్మాయిని చూస్తుంటే నవ్వు వచ్చింది. చిన్నగా శబ్దంలేని నవ్వు నవ్వుతూ –

''మాటలు రావా? మూగమ్మాయివా?'' అన్నాడు.

అతను తెలుగు మాట్లాడు తున్నాడు. తెలుగు వాడే అనుకుంటే హృద్యంగా వుంది. ఆనందంగా కళ్లు విప్పారించి చూసింది. ఆ పొడుగాటి రెప్పలు విచ్చుకున్న జోతుల్లా వెలిగాయి. ఆ కళ్లలోని భావం మరో విధంగా అర్థం చేసుకున్నాడు. మై గాడ్ నిజంగా మాటలు రావా? ఆ కంఠంలో ఆతురత, ఆశ్చర్యం, వేరేదో భావం తుప్పిరిగొన్నాయి.

ఆ కంఠ స్వరం విని కను రెప్పలు క్రిందికి వాల్చింది. కంటిలో మెదిలిన కొంటెతనాన్ని అతను చూడలేదు. అతని ప్రశ్నకి ఇంకా జవాబు ఇవ్వలేదనుకుని అడ్డంగ తల తిప్పింది.

''ఎవ్వరైనా వస్తారని ఎదురు చూస్తున్నారా?''

''అవును'' అని తల వూపింది.

''వచ్చే వాళ్లయితే ఇప్పటికే వచ్చి వుండే వారు... ఎక్కడికి పోవాలి?''

నళిని హేండ్ బాగ్‌లో నుంచి పెన్ తీసి చిన్న నోట్‌బుక్ మీద ''బర్కత్‌పూర్ చమన్'' అని వ్రాసింది.

వెన్నెలలా వున్న అమ్మాయి ''మూగది'' అనుకుంటే అతని హృదయం మూలిగింది బాధగా. ఎంతో జాలిగా చూశాడు. దగ్గర్లో సిగరెట్ త్రాగుతున్న ఆటో రిక్షావాణ్ని చప్పట్లు కొట్టి పిలిచాడు.

''బర్కత్ పుర్ చమన్ దగ్గర మేమ్‌సాబ్ చూపిన ఇంటి దగ్గరకి తీసుకు పోవాలి'' బొంబే స్టయిల్ హిందీలో అడిగాడు.

''సాబ్ సామాను వుంది'' తల గీక్కుంటూ మూడు రూపాయలు ఇప్పించ మన్నాడు.

''టూ ఫిఫ్టీ'' అదే ఆఖరు అన్నట్టుగా పెట్టె బెడ్డింగ్ పెట్టి 'కూర్చోమని' సైగ చేశాడు.

నళిని కూర్చున్నాక ప్రక్కన ప్లాస్టిక్ బుట్ట పెట్టాడు. అతనికి కృతజ్ఞతలు తెలుపుకున్నట్లు నవ్వుతూ 'చెయ్యి వూపుదాం' అని అనుకుంటూ వుండగానే ఆటో కదిలి పోయింది. 'అయ్యో!' అని బాధ పడింది.



ఆటో పోతూ పోతూ పెట్రోలు బంక్ దగ్గర ఆగింది. అతను పెట్రోలు పోసుకుంటుండగానే, ప్రక్కనే వచ్చి స్కూటర్ ఆగింది. యధాలాపంగా ఆ వైపుకు చూసింది. అతను చిద్విలాసంగా నవ్వుతున్నాడు. జవాబుగ నళిని నవ్వింది. ఆటో కదిలింది. ఆటో వెనుక స్కూటర్ అనుసరిస్తూంది.

చమన్ ప్రక్క రోడ్డులో బాట ప్రక్కనే వున్న ఇంటి ముందు ఆగింది. ఆటో అతను సామాను పట్టుకొని ప్రహరీ గేటు నుంచి వెళ్లాడు. బాదంచెట్టు వున్న ఇంటివైపు గుర్తుగా చూశాడు స్కూటర్‌ని ఆపి, చూస్తున్న అతనికి చేతులు జోడించి నమస్కారం చేసింది.

కలువ మొగ్గల్లా ముడిచిన ఆ చేతుల్ని చూశాడు. తల చెదరి, పిల్ల గాలులకు కదలుతున్న నుదుటి మీద పడిన ముంగురులు చూశాడు. బొమ్మలా వున్న ఈ అమ్మాయికి మాటలు రావు. వస్తున్న నిట్టూర్పుని అణచుకొని, ఆ దృశ్యాన్ని మనస్సులో నిలుపుకున్నట్టు చూసి, నుదిటిమీద చెయ్యి ఆనించి నేవీ స్టయిలో సెల్యూట్‌చేసి స్పీడుగా వెళ్లిపోయాడు. కనుమరుగయ్యేవరకు చూసి ఇంట్లోకి వెళ్లింది.

ఇంట్లోవాళ్లు ఇంకా నిదురలేవనట్టు నిశ్శబ్దంగా వుంది ఆటో అతనికి రెండున్నర యిచ్చింది. అది చాలనట్లు నిలుచున్నాడు.

మరింకోసారైతే ఇచ్చేదికాదు. ఈరోజు ఆనందంగా వుంది. ఇష్టంగా మరో యాభై పైసలు ఇచ్చింది. అతను సలామ్‌కొట్టి వెళ్లాడు.

బోర్లా తీసియున్న తలుపుల నుంచి వెనుకకు వెళ్లింది. పని పిల్ల పంపు దగ్గర అంట్లు తోముతున్నది. ప్రక్కన కుంపట్లో బొగ్గు తీస్తోంది అమ్మ పార్వతమ్మ.

తనకు తెలిసి, ఎన్నో పుతుకులు పడి మెత్తగవున్న నల్లబడిన జరీ వెంకటగిరి చీర, తెల్లటి రవికతో బొద్దుగా, తెల్లగా, తెల్లని జుట్టు వ్రేలుముడి చుట్టుకొని, వంగియున్న తల్లిని చూస్తూ, ఆర్ద్రంగా 'అమ్మా' అంటూ, ఆప్యాయంగా 'అమ్మా!' అని పిలిచి ఎన్నాళ్ళు అయింది. ఆ పిలుపు మధురంగా వుంది. మళ్ళీ 'అమ్మా!' అని పిలిచింది.

చేతిలోని పట్టుచీర జారవిడచి, దూడ అరుపు విన్న గోమాతలా, చివ్వున నిటారుగా నిలబడింది. నవ్వు ముఖంలో అమ్మను చూస్తున్న నళిని ముఖం విప్పారగా "ఎప్పుడు వచ్చావే తల్లీ" అని ఎదురేగి, కూతుర్ని దగ్గరకు తీసుకొని, శిరస్సు ఆఘ్రాణించి వీపుని నిమురుతూ వుండిపోయింది.

అమ్మకి కొద్దిగా దూరం జరిగి 'స్టేషన్‌కి ఎవరూ రాలేదు" అని మురిపెంగా కోపం ప్రదర్శించింది నళిని.

"రేపనుకున్నాను. మీ అన్నయ్యకి చెప్పదా మనుకుంటున్నాను. వాడు వూరు నుంచి రాత్రి వచ్చాడు ... పద ముఖం కడుక్కో, కాఫీ పెడతాను..." అంది.

"ట్రైన్‌లోనే ముఖం కడిగాను..." తల్లి వెంట వంట గదిలోకి పోతూ, సంబరంగా నళిని వైపు చూస్తూ పలకరింపుగా నవ్వుతూనే గిన్నె తోముతున్న పని పిల్లతో...

"సీతా! బయట సామాను వుంది" అంది.

గ్యాస్ పొయ్యి అంటించి పాల గిన్నె పొయ్యిమీద పెట్టుతూ,

"నీ స్నేహితురాలు హంస బాగుందా ?" అంది పార్వతమ్మ.

నళిని నవ్వుతూ "వాసవి, అక్కడవాళ్లందరూ బాగున్నారు. నిన్ను జ్ఞాపకం చేశారు. వాసవికి పెళ్లి చేయాలని వున్నారు. వాసవి బావ వచ్చాడు. బాగున్నాడే. చాలా మంచివాడు." అలా కబుర్లు చెబుతున్న కూతురి వైపు నిదానంగా చూసింది. కొత్తగా తను చేయవలసిన పని జ్ఞాపకం వచ్చినట్లుంది. నళిని పెళ్లిడుకు వచ్చిందన్న మాట. ఇన్నాళ్లు ఆ తలంపే లేదు.

గ్లాసు నిండుగ పాలు పోసి కాస్త డికాషన్ కలిపి వేడి వేడి గ్లాసు అందించింది. మరి కాస్త డికాషన్ వెయ్యమని గునిసింది. "వాళ్లెప్పటికి లేస్తారు ?"

"అన్నయ్య రాత్రి చాలా పొద్దు పోయి వచ్చినట్లుంది. మురళి లేడు. వదిన అన్నయ్య వస్తే వాడి వెంట వెళ్లాడు."

"అక్కయ్య వస్తుందా ?"

"ఆ... పిల్లలు నీ కోసమే ఎదురు చూస్తున్నారు. ఈ మధ్యనే మీ బావ కేదో ప్రమోషన్ వచ్చింది..."

ఆ తల్లీ కూతుళ్ల మాటలు విని బాత్‌రూమ్ లోకి పోతూ వంట గదిలోకి తొంగి చూసింది వదిన వసుంధర.

చామన ఛాయ, పొడుగు పొట్టి కాకుండా మధ్యస్థంగా లావు ఎత్తు వుంది.

నిద్రలో వుబ్బిన కళ్లు—రేగిన వుంగరాలజుట్టు.

"నళినీ! ఎంత సేపైందివచ్చి" అని పలుకరించింది.

"గుడ్ మార్నింగ్ వదినా ... మురళిని పంపించివేశావేం ." అంది.

"ఓ పది రోజుల్లో వచ్చేస్తా నన్నాడు. నీకు ఇక అన్నీ సెలవులే" అంటూ నవ్వింది. వదిన బాగా నవ్వితే క్రింద పళ్ళ వరస తప్పినవి కనిపిస్తాయి. అందగత్తె కాక పోయినా, సౌమ్యంగ వుంటుంది. కట్నం ఎక్కువ. మంచి కుటుంబం అని అన్నయ్య చేసుకున్నాడు. పెళ్లాం అందగత్తె కాదని ముందు ముఖం చిన్నబుచ్చుకున్నా, పెళ్లయిన వారానికల్లా పెళ్లాం కొంగు పట్టుకొని తిరిగాడు. భార్యకి చెప్పకుండ ఏ పనీ చేయడు. వాడు సుఖంగ వుంటే అంతే చాలు అనుకొంది. లౌక్యంగా కొడుక్కి దూరం జరిగింది పార్వతమ్మ. ఆడపడుచు బాధ్యత తమదే. అది న్యాయమే! వసుంధర తలచింది.

నళినిని పలుకరించి బాత్‌రూమ్‌లో దూరింది వసుంధర. వదిన ముఖంలో అయిష్టం లేదు. ఇష్టం లేదు. జీవితాన్ని అలాగే తీసుకుంటుంది వదిన అని తలంచింది నళిని.

అన్నయ్య సాగర్ తొమ్మిది గంటలకిగాని లేవలేదు. పార్వతమ్మ నళిని జుట్టుకి వున్న చిక్కు తీస్తూ "ఇదేం చిక్కు ? తలకి శుభ్రంగా నూనె పెట్టి దువ్వుకోరూ ? తల చూడు ఎట్లా ఎండిపోయిందో" అంటూ చెక్కదువ్వెనతో పేలు దువ్వింది. వచ్చిన ఒకటి రెండు పేలను కచ్చిగ కుక్కి, దగ్గరవుండి 'అంత వేడి వద్దు' అంటున్నా కుంకుడికాయలతో తలస్నానంచేయించి, వీపు,కాళ్ళు, చేతులు రుద్దింది. తల్లి చేయి పడగానే మెరుగు పెట్టిన బంగారంలా వళ్ళు మెరిసింది.

తలారపెట్టుకుంటుంటే పార్వతమ్మ మెత్తగా పిసికి తెచ్చిన పెరుగన్నం నోటికి పెట్టుతుంటే – 'ఆ' ... మని ఆవులిస్తూ వచ్చిన సాగర్, "పాపాయి ఎప్పుడు రావటం ? హంసడిభకులు విడిపోయారా ?' అని అన్నయ్య దగ్గరగావచ్చి నిల్చున్నాడు.

"నీతో మాట్లాడను. స్టేషన్‌కి రాలేదు." ఆప్యాయంగా అన్నయ్యవైపు చూసింది. తల నున్నగా దువ్వివుంది. లేస్తూనే అద్దం ముందు నిలుచుని తల దువ్వుకుంటాడు. చెంపలపైన ఒకటి రెండు శ్వేతవర్ణ కేశాలు మెరుస్తున్నాయి. గళ్ళ లుంగి, చేతుల బనియను, కండలుతిరిగిన శరీరం, కాస్త బొజ్జ చేసినట్లుంది. తల్లి మెకట్లుకాని తల్లి రంగుగాని రాలేదు. పొడుగు ముక్కు. ముక్కు చివర్లో రంధ్రాలు వెడల్పుగా వుంటాయి. చిన్నవి పెద్దవికాని కళ్ళు, దట్టమైన కనుబొమ్మలు, విశాలమైన నుదురు, ఆరోజుకి పెరిగిన గడ్డం, మీసం, వూళ్ళు తిరిగి వచ్చాడేమో ముఖం రంగు వాడిపోయింది. ఆ అన్నాచెల్లెళ్ళ మధ్య పైకి కనబడని అనురాగం వుంది. రక్తసంబంధులు, ఒకరినొకరు ఆప్యాయంగా చూసుకున్నారు. సంతోషించారు. గుండెల్లో వున్న ప్రేమ పైకి వ్యక్తంచేయడు. చెల్లెమ్మా, నళినీ అని కలవరించడు. ఆల్‌వాల్‌లో వున్న పెద్దచెల్లి రాజకుమారిని చిలున్నప్పుడల్లా చూసి పిల్లలకి తినుబండారాలు, బొమ్మలు, డ్రెస్‌లు తెచ్చి యిస్తూనేవుంటాడు.

పార్వతమ్మ వచ్చినపుడు "అన్నయ్య వచ్చాడు" అని చెప్పింది రాజకుమారి.

నా కొడుకు తన తోబుట్టువులను మరచిపోడు. ప్రపంచంలో లౌక్యంగా మెలగటం తెలిసినవాడు అని కొడుకుని మనసారా తన ఆయుస్సు కూడ పోసుకొని జీవించమని దీవించేది లోలోన. అభ్యంగ స్నానం చేసింది. కడుపు నిండింది. తన వాళ్ల మధ్య నిర్భయంగ పడుకొంది. తల దిండుకు తగలగానే కన్నులు మూతలు పడ్డాయి. ఏవేవో మధురమైన భావాలు. శరీరం అలసి పోయినా, మస్తిష్కం నిద్రపోదు. ఆలోచనలు మాటి మాటికి ఆ అందమైన యువకుడి చుట్టూ తిరుగుతున్నాయి. అతనేం చేస్తుంటాడో ? ఏం పేరో ? మరచి పోతాడా ? పరోపకార పరాయణు డిలా వున్నాడు. ఇంటిదాక వచ్చి వెళ్లాడు. అందమైన మనస్సున్న మనిషి... అలాటి ఆలోచనలతో నిజంగా నిద్ర పోయింది నళిని.

## కల్లలతో ఇల్లు ...

కల్లలతో ఎవరైనా
ఏ యిల్లును నిలిపారు ?
కల్లలతో ఏ యిల్లును
నిలిపారో చెపుతారా ?

ఏనాడో ఒకనాడు
చెప్పాడొక మానవుడు
మూరు కల్లలైన పలికి
ఒక యిల్లును నిలుపమని !

పొరపాటునో గ్రహపాటునో
విధి బలమునో వెర్రితనమునో
ఏనాడో ఒకనాడది
అచ్చుకొనే ఉండవచ్చు !
కాని సర్వత్ర అదే సూత్ర
మన్వయించబోదని
తెలిసికొనుడు ఇది తథ్యం !
మరువరానిదీ సత్యం !

కల్లలతో నిలుపు యిల్లు
కలకాలము నిలువదు !
కూలిపోక మానదు !
నిష్కల్మషమైనపుడె
నిలకడగా ఉండగలదు !
తెలివిగలిగిన వారలెల్లరు
తెలిసికొనుడు ఇది తథ్యం !
మరువరానిదీ సత్యం !

— "హృదయం"

అక్క రాజకుమారి వంట గదిలోనే వుంది. నళిని వాసవికి వుత్తరం వ్రాసి కవరుని నాలుకతో తడిచేసి మూసి, అడ్రసు వైపు చూసింది వాసవిని చూస్తున్నట్లుగ. ప్రయాణం సుఖంగానే జరిగినట్లు, స్టేషన్‌లో ఓ ధవళాక్షుడు కనిపించిన తీరు వ్రాసింది. ఆ రోజు పగటి నిద్ర మంచి మేల్కొని తల్లి వారిస్తున్నా అక్క దగ్గరకి ప్రయాణం కట్టింది. "లేడికి లేచిందే పరుగు" అంటూ స్కూటర్ స్టార్ట్ చేశాడు.

సూట్‌కేస్ స్కూటర్ ముందుంచి వెనుక కూర్చుంది. తల్లికి, వదినకి 'బాయ్' అని చెప్పింది. "అన్నయ్యా! మెల్లగా, నాకు అలవాటు లేదని నీకు తెలుసుగా" అంది జాగ్రత్తగా కూర్చుని.

"ఎంతకీ ఈ ఆల్‌వాల్ రాదేం ?" అని గొణుగుతూనే వుంది.

"నీవు వస్తున్నావనే ఆల్ వాల్ ఎదురొస్తుందే" అన్నాడు సాగర్.

సత్యాటాకీసు వస్తూనే "వచ్చేశాం, వచ్చేశాం" అన్నాడు.

"ఇంటికి దగ్గరగా సినిమా హాలుంటే బాగుంటుంది."

"ఎదువు, సంధ్యా మానేసి మార్నింగ్ ఇంగ్లీషు పిక్చర్, మధ్యాహ్నం తెలుగు పిక్చర్, రాత్రి షో హిందీతో ముగించవచ్చు. అంతేనా?" అన్నాడు.

"అన్నయ్యా ! నీవు అలా చూసి వుంటావు వొంగ" అంది. చదువుకునే రోజుల్లో చేసినవి గుర్తు వచ్చి తియ్యగా నవ్వారు. మాటల్లోనే రోడ్డు తప్పించి, మలుపు తిరిగి, ఓ భవంతి ముందు ఆగి హారన్ ఇచ్చాడు.

"మామయ్యా !" ఎక్కడో పిల్లల గొంతులు వినిపించాయి. మరు నిమిషంలో ఎదుట కొచ్చి సాగర్ మీదకు దూకారు.

"మమ్మీ ! మమ్మీ ! ఆంటీ ఆంటీ" అని ముక్తకంఠంగా అరిచారు. లోనున్న వాళ్ళ అమ్మకి చెప్పారు.

నళినికి చెరోప్రక్క వ్రేలాడారు.

"ఆంటీ నీవు మాకు సర్‌ప్రైజ్ ఇచ్చావు కదూ ! రేపు వస్తావనుకుంటున్నాం. మమ్మీ నీకోసం స్వీట్ చేస్తూంది..." అంటూ సగం ఇంగ్లీష్ – హిందీలో గుక్కతిప్పకోకుండా అరచి చెప్పుతున్నారు.

పావని తెల్లని ఫ్రిల్లుఫ్రాకులో పెటీకోట్‌కి నాజూకుగా మెడకి చేతులకి వేసిన లేసు కనిపిస్తూ తెల్లని హంసలా వుంది. ఎత్తుగా మెడ పైకి కత్తిరించి నుదుటిమీదకి దువ్విన ఫ్రింజ్ బొద్దుగా బొమ్మలా ముద్దొస్తోంది. నళిని ఎత్తుకొని బుగ్గమీద గట్టిగా ముద్దు పెట్టుకొంది.

"ఆంటీని లోనికి రానీయరా." హిందీలో వారిని గద్దించినట్లు అంది. ముఖం అంతా నవ్వుని పులుముకొని ద్వారం దగ్గర నిలుచుంది రాజకుమారి. నల్లని జుట్టు, చిన్న పాపిడి, అందులో కుంకుమ అద్దింది. జుట్టు పైకి దువ్వి మెడ మీదనే అంతంఅయిన జుట్టుకి రబ్బర్ బ్యాండ్ వేసింది. పొట్టిగా పిల్లలలాగా జామపండు ఛాయలో వుంది. చేతులులేని జాకెట్టు, చిన్న

# నళిని

చిన్న పూలున్న బ్లూ కాశ్మీర్ సిల్కుచీర కట్టింది. కళ్ళకి కాటుకరేఖలు లేవు. పెదాలకు లైట్‌గా పింక్ లిప్‌స్టిక్ వేసింది. నుదుట తిలకంబొట్టు వుంది కాని మెడలో మంగళసూత్రాలున్న జాడ లేదు. తూర్పు తెల్లబడినట్లు మెడ చుట్టూ తెల్లగా వుంది. దినంలో ఏ ఘడియలో చూసినా అలాగే సాధారణంగా ఆర్మీ ఆఫీసర్ల భార్యలు ఎప్పుడూ మేకప్‌తో వున్నట్లుంది. ఆ అక్కచెల్లెండ్రను ఆ పిల్లలు మాట్లాడుకోనీయ లేదు. రాజకుమారి వాళ్లని కాసేపు బయటకివెళ్లి ఆడుకోమంది. ఇద్దరిచుట్టూ చెయ్యివేసి వస్తున్న నళిని వారిని మరీ దగ్గరకు అదుముకొని "కాసేపు వూరుకోండి. రాజకుమారి వేసే ప్రశ్నలకు జవాబు చెప్పేసి ఆడుకుందాం" అంది.

"చైనీస్ చెక్కర్స్ ఆడుదామా ?"

"అలాగే."

"ఆంటీ కారమ్స్" అని పవిత్ర అన్నాడు.

"ఓ."

"నీవు వాళ్లని గారాబంచేసిపోతావు. తర్వాత వారిని దారిలోనికి తెచ్చుకోవటానికి నెల పడుతుంది" అంది రాజకుమారి.

"ఎందుకో అక్క పిల్లలమీద అంత ప్రేమ వుంటుంది."

"అన్న కొడుకుమీద లేదా?" అన్నాడు సాగర్ ఫ్రిజ్ దగ్గర నిల్చొని.

"అక్క అంటే అన్న అని కూడ" అని నళిని అంటే,

"ఆంటీ మురళి కంటే మా మీదే నీకు ఎఫెక్షన్ కదూ ..." పావని నళిని చెవిలో అంది. పావనిని వడిలో అడ్డంగాపడుకోబెట్టుకొంది.

"నాకు పనివుంది నే వెళ్తా" అన్నాడు సాగర్.

"భోజనంచేసి పోదువు" రాజకుమారి అంది.

"లేదు వెళ్ళాలి, పని వుంది" అన్నాడు.

కేక్ ఒక సాసర్‌లో, జీడిపప్పు మరో సాసర్‌లో తెచ్చి బల్ల మీద పెట్టింది.

"మంచిగ మామయ్యని ఫీడ్ చేస్తది మమ్మీ. కిషోనట్ మాకు ఇవ్వలేదు ..." మమ్మీమీద ఫిర్యాదు చేసింది పావని.

"అయ్యో పప్పీకి ఇవ్వలేదా ? కమాన్" అంటూ పిలిచాడు పావనిని.

పావని వెళ్లి జీడిపప్పు తీసుకొని మామయ్య నోటికి అందిచ్చింది. నోట్లో పెట్టుకొని పెద్దగ నవ్వాడు. ఆ ఆత్మీయులు ... ఆ కాసేపు ఆత్మా నందాన్ని పొందారు.

* * *

నళిని వుత్తరం పట్టుకొని, తనున్న గెస్ట్ రూమ్ నుంచి క్రిందికి వచ్చింది. పైనే వున్న ఆ గదికి ఆటాచ్డ్ టాయ్‌లెట్ రూముంది. ఓ చిన్న టేబిల్, రెండు కుర్చీలు పట్టే బాల్కనీ వుంది. మెట్లు నేరుగ క్రింది హాలు డ్రాయింగ్ రూములోకి వచ్చాయి. నళిని తన సమయం ఆ మెట్లమీదనే గడిపేస్తుంది, అక్కడే చల్లగ వుంటుందని.

డ్రాయింగ్ రూమ్‌ని వుడెన్ కర్టన్‌తో వేరుచేసిన వెనుక భాగము డైనింగ్ హాలు. దాని ప్రక్కన వంటగది. వంటగదిలోంచి మరో ద్వారం గుండా పోతే స్టోర్ రూమ్. లివింగ్ హాలుకిముందు బెడ్ రూమ్ పిల్లలది. ఇంగ్లీషు పద్ధతికి మిలటరీ రూల్సు బోధించిన పిల్లలపెంపకం వారిది. పెద్ద వాళ్ళకి మరో బెడ్‌రూమ్. వాటికి వేరువేరు బాత్ రూమ్, లావెటరీలు. గదులకి తగిన ఫర్నిచర్ వుంది. అది వారికిచ్చిన బిల్డింగ్. 'ఫామిలీస్' తో వున్న ఆఫీసర్స్ కొందరు అక్కడ వున్నారు. ముందు చిన్న వరండా, వరండా కటకటాలకి అల్లించిన మనీప్లాంటు. వెనుక వరండాలో పూలకుండీలు పెట్టుకున్నారు. ఇంతటి ఇల్లు పైన మరొకటి వుంది.

"అక్కా లెటర్ పోస్టు చేసివస్తా" అని బయటికి వచ్చింది నళిని.

తను వుండి వచ్చిన వూర్లలో ఇలా చీటికి మాటికి చిన్నచిన్న పనులకు ఆడవారు బయటికి రారు. అలా పోవటం తప్పకూడాను. ఇక్కడ అన్ని పనులు పనివారికి చెప్పలేము. చేయటానికి తీరికా వుండదు వారికి. మార్కెట్టుకి, చిల్లర సామానుకి, టైలర్‌దగ్గరకి, చివరికిలాండ్రీకికూడ రాజకుమారి వెళ్లి వస్తుంటుంది. నళినికి అలా పోవాలంటే సిగ్గుగా వుండేది. ఉత్తరం పోస్టుచేయటానికి పిల్లలు లేరు. దినమంతా వారి అల్లరి భరించలేము. అంతకంటే వచ్చిన చదువు సెలవుల్లో వచ్చినంత త్వరగా మరచిపోతారు. పిల్లలు అని సమ్మర్ స్కూల్‌కి పంపారు.

"ఆంటీ వుంది హాలిడేస్‌లో ఇలా స్కూల్‌కి పంపటం న్యాయంకాదు. ఇట్ ఈజ్ నాట్ ఫెయిర్" అంటూ గొడవచేస్తూ వెళ్లారు.

తిరిగి పన్నెండుగంటలకి వస్తారు. భోజనం చేసిన తర్వాత పడుకోవలసిందే. నిద్ర వచ్చినా, రాక పోయినా మధ్యాహ్నం పడుకోవలసిందే. ఆదిరూలు.

"ఇది ఇల్లు కాదే అక్క, మిలటరీ స్కూలు" అంటూ పిల్లల్ని రెచ్చగొట్టుతుంది. ముగ్గురూ కలసి తిరుగబడుతారు. రాజకుమారి నవ్వి వూరుకొని మెల్లిగా భర్తకు అంటించేది.

రావుగారు చేతికర్ర పట్టుకొని కమాండింగ్ ఆఫీసర్‌లా వచ్చేవారు. బావగారు అంటే ఆట్టే చనువులేదు. ఎర్రజీరలతో వున్న పెద్ద కళ్ళు, పలుచబడిన జుట్టు, పైకి దువ్వుతారు. చెంపల దగ్గర నెరుపు వుంది. చప్పిడిముక్కు కాదుగాని ముక్కు వదుకున్నట్టు వుంటుంది. మెలితిరిగిన సన్నని మీసాలు, పలచని చెంపలు. చుబుకం మధ్య చొట్ట. పొట్ట లోతుగా లాక్కుని ఛాతీ ఉబ్బించి నడుస్తారు. చూడగానే మిలటరీ ఆఫీసరని తెలిసి పోతుంది.

'భయంలేకుండా అక్క ఎలా కాపురం చేస్తూందో ?' అనుకొని, ఆ మాట అంటే, తియ్యగా భర్త మీద అనురాగం వున్నట్లు నవ్వింది రాజకుమారి.

భర్త మీద అంత అనురాగం ఎందుకో. రావటం ఆలస్యమైతే, ఆరాటంతో ఎదురు చూస్తూంటుంది. ఢిల్లీకి, బాంబేకి వెళ్లితే వచ్చేదాకా సరిగ్గా నిద్రపోదు. ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని వుంటుంది. ఆ పిరికితనం జీవితంలోని మాధుర్యానికి చేదు కలసినట్లుగా వుంటుంది.

నళిని రోడ్డుమీద నుంచి గాక సందులో నుంచి పోస్టాఫీసుకు వచ్చింది. కొస్త దూరంలో బస్ స్టాపు వుంది. అక్కడ నిల్చున్న అమ్మ దగ్గర నుంచి ఇటు వచ్చిన ఓ నాలుగేళ్ళ అబ్బాయి రాళ్ళు, కాయితాలు ఏరి ఏరి పోస్టు బాక్స్‌లో వేస్తున్నాడు. నళినిని చూసి పరుగెత్తిపోయాడు.

నళిని ఉత్తరం వేసి పడిందో లేదోనని పైన కొట్టింది. తుంటరిపనుల్ని చేస్తున్న పిల్లల్ని చూసి పెద్దవాళ్ళు అదిలించరు. రోడ్డు ప్రక్కన నీళ్ళు ధారాపాతంగా కారిపోతున్నా ఆ పంపుని కట్టరు. ఆ నీళ్ళు ఆపటానికి ప్రయత్నించరు. మన కెందుకు అని పోతూనేవుంటారు. నేషనల్ వేస్ట్ అని అనుకోరు. యాక్ అని నడిరోడ్డులో వుస్తారు. ఎప్పటికి తెలుసుకుంటారు ప్రజలు. నేర్పినా ఆచరిస్తారా ?. ఆ ఆలోచనలలో వెనక్కి తిరిగింది. మరీ దగ్గరలో నిల్చున్న అతన్ని చూసి వులిక్కిపడింది. ఎడారిలో ఒయాసిస్సును చూసిన మనుజునిలా ఆ తెల్లవాడు నళినిని చూస్తున్నాడు. మధ్యాహ్నం సూర్యునిలా అతని కళ్ళు వెలిగిపోతున్నాయి. నళిని గుర్తింపుగా నవ్వింది. 'చంద్రకిరణం చెంపలమధ్య పాకినట్లుంది ఆ నవ్వు' అని అనుకున్నాడు.

ఆ చెట్టు క్రింద ఒకరినొకరు నిశితంగా చూసుకుంటున్నారు. ఆ చూపులు నిర్భయంగా వున్నాయి. అలా చూసుకుంటున్న వారికి ఎదుట నిలబడిన వ్యక్తి తనకేదో అవుతారని తెలుసు. ఆత్మీయత వారిని పట్టేసింది.

ఆరోజు అలా వదిలిపోయిన నళిని — ఆ దినం చాలాసార్లు జ్ఞాపకం వచ్చింది. చక్కని అమ్మాయికి మాటలురావు. ఎంత అన్యాయం. ఆ అమ్మాయిని ఎవ్వరు చేసుకుంటారు. అందం చూసి చేసుకోవచ్చు. కాని, కట్నం ఎక్కువ పుచ్చుకుంటారు. అంత కట్నం ఆ తల్లిదండ్రులు ఇచ్చుకుంటారా? ఆ కళ్ళు భావప్రకాశంగా వున్నాయి. తన భావాలు వ్యక్తంచేసేది ఆ కళ్ళే మరి.

ఆ మూగపిల్లను మళ్ళా చూడాలని అనుకున్నాడు. సాయంకాలం బయటికి వస్తుందేమో అని, రెండు మూడుసార్లు ఆ ఇంటి ముందు తిరిగాడు. పిలుస్తున్నట్టు హారన్ కొట్టాడు. మూడోసారి తెల్లవెంట్రుకలున్న వృద్ధు బయటకి వచ్చింది. వెనక్కు తిరగకుండా వచ్చేశాడు ప్రొద్దున వెళ్ళాడు. ఆ సుందరి కనబడలేదు. కనబడకపోవటం మంచిదే. పరిచయం యెలా దారితీస్తుందో? ఆ మూగపిల్లకి ఏవో ఆశలు కలిగితే? ... అనుకొని ఆలోచించటం మానేశాడు.

కాని తొలి సంధ్యలో చూసిన పిల్ల చక్షుః ప్రీతి కలిగించింది. పదే పదే తలచుకోవటంతో మనస్సులో కలసిపోయింది. ఎలాగైనా సరే ఆ అమ్మాయిని కలుసుకోవాలని నిశ్చయించుకున్నాడు. అలా నిశ్చయం కలుగగానే చూడాలని తాపము కలిగింది. ఆ తాపముతో నిద్రపట్టక మేల్కొన్నాడు. అలా వరుసగా మూడు రాత్రులు జాగరము చేసేటప్పటికి నిద్రలేమితో కళ్ళ క్రింద నలుపు పులుముకొంది. చిక్కిపోయాడు. ఏమిటీ మనస్సు, శరీరం ఇన్ని అవస్థలకి గురైందని అనుకొని మామయ్యని అడిగాడు

# నళిని

''మన్మథావస్థలు'' అని చెప్పాడు

''మైగాడ్ మన్మథావస్థలా!'' అని కళ్ళు విప్పారించాడు.

''నీ వో అమ్మాయిని చూశావా ?''

''చూశాను.''

''అందంగా వుంది కదూ ?''

''అవును.''

''అయితే ఆ అమ్మాయిని నీవు ప్రేమించావు. సందేహం లేదు. మన్మథావస్థలు పన్నెండు. ఒకటి చక్షుః ప్రీతి. రెండు మనః సంగమము. ఆ అమ్మాయి మనస్సుతో నీ మనస్సు కలసిపోయిందా! మూడోది సంకల్పం. అంటే ఆ అమ్మాయి మీదే నీ మనస్సు వుండిపోయింది. ఆ ప్రలాపముతో జాగారము చేశావు. తర్వాతది - కృశత — అంటే చిక్కిపోయావు. అవునా? తిన్నది సహించటం లేదు, సరిగ్గా మధ్యావస్థలో వున్నావు. శకుంతల తాపంలో వుండగానే దుష్యంతుడు వెళ్ళాడు. నీవు ఇప్పటికే ఆలస్యం చేశావు మూర్ఖ. ఆ తరువాత మరణం. ఎంతో దూరం లేదు. ప్రొసీడ్ మైబాయ్'' అంటూ మామయ్య పేక ముక్కలు క్రిందకి పడేసి, గట్టిగా సిగరెట్ పీల్చాడు. పైకి లేస్తూ జేబులోంచి పది రూపాయల నోటు తీసి మామయ్య చేతిలో పెట్టాడు. ''అక్కతో చెప్పనులే'' అంటూ నోటు అందుకున్నాడు.

''ఆ అమ్మాయి మూగది మామయ్యా!''

''అదృష్టవంతుడివి'' అన్నాడు పేకముక్కలు కలుపుతూ. మళ్ళీ ఆ అమ్మాయిని చూడాలన్న ప్రయత్నం ఇప్పటికి ఫలించింది. అనుకోకుండా ప్రత్యక్షమైన నళినిని చూసి, సిగ్గు బిడియం వదలేసినట్లు దగ్గరకు వచ్చి నిల్చున్నాడు.

''నా పేరు అజయ్. కెప్టెన్ అజయ్. నీ పేరు ? ''

బాహ్యస్మృతి లోకి వచ్చి ముందుకు అడుగు వేసింది.

జేబులోంచి పాకెట్ బుక్, చొక్కా జేబు లోంచి పెన్ను తీసి ముందుకు చాపాడు. ''వెళ్ళకు కాస్సేపు నీతో మాట్లాడాలి. ప్లీజ్ ''

తను నిజంగానే మూగదని అతను మృదువుగా మెల్లగా, మాట్లాడుతూ పెన్ను, బుక్కు ఇస్తుంటే, అంత వరకు కంఠానుగతమైన నవ్వు తరంగాలు పైకి వస్తుంటే, కష్టంగ నవ్వును బిగపెట్టుకుంటూ, పెన్ను, బుక్కు అందుకుంది.

''నీ నవ్వు చాలా బాగుంది'' అప్రయత్నంగా అనేశాడు.

వ్రాయబోతు కళ్ళు పైకెత్తింది.

''నీ కళ్ళు పువ్వుల్లావుంటాయి'' అని అజయ్ అన్నాడు.

''పేరు నళిని ... మీరు అందంగ వున్నారు'' అని వ్రాసి ఇచ్చింది.

ఒక్కటి అక్షరాలను చూసి, ''నీ వ్రాతకూడ బాగుందే, ఏం చదువుకున్నావు ?'' అన్నాడు. పుస్తకం ఇస్తూ నళిని వ్రాయబోతుంటే, ''నళినీ'' అన్నాడు. అతన్ని చూసింది. ''ఐ లవ్ యు'' అన్నాడు.

ఆశ్చర్యంగా అతని కళ్ళల్లోకి చూస్తూవుండిపోయింది. ఇంత త్వరగా అతని ప్రేమ వెల్లడిస్తాడనుకోలేదు. తను అతన్ని ప్రేమిస్తుందా? అని అనుకోలేదే! అతన్ని నమ్మటం — ఆ కళ్ళు నిర్మలంగా వున్నాయి.

నళిని సందేహాలు ఆ కళ్ళల్లో చదివి మెత్తగా నవ్వుతూ —

''నీవు నా లాగ తొందర పడనవసరంలేదు. నా మనసులో మాట చెప్పాను దాచుకోలేక. నీ యిష్టం. తర్వాత నీ అభిప్రాయం నాకు చెప్ప వచ్చు. నీకు మాటలురావని నాకేం అభ్యంతరం లేదు. నీ కళ్ళలోని భావాలకు నేను అర్థం చెప్పుకోగలను. నీ వెక్కడ వుంటున్నావు. అన్నీ చెప్పు. ఐమీన్ వ్రాయి'' అన్నాడు జేబుల్లోనే చేతులు పెట్టుకొని.

''వత్తు లేదు కదా! ఆ పోస్ట్‌బాక్స్ మీద పెట్టుకొని వ్రాయి.''

నళిని తన వివరాలు అన్నీ వ్రాసింది. గబగబ చదివేశాడు.

''బి.ఏ. పరీక్ష వ్రాశావా ?'' అన్నాడు నమ్మలేనట్టు. తలూపింది. ఇంటికి దగ్గరవుతూ, ఆగిపోయి అదే మా యిల్లు అన్నట్టు చూపించింది. ఇంకా వెంబడిస్తుంటే, ఆగి ''ఇకవస్తాను'' అన్నట్టు నమస్కారం చేసి గబగబ వెళ్ళిపోయింది. లోనికిపోతూ వెనక్కి తిరిగి చూసింది. వెనకనే తనలో తాను నవ్వుకుంటూ వస్తున్నాడు భయంగ లోనికి చూసి అజయ్ వైపు చూసింది. ప్రక్క మెట్లమీద నిలబడి, ''పైన వున్న ముఖర్జీ వాళ్ళు నా స్నేహితులు. మీ బావగారు నాకు తెలుసు. మేమంతా చిల్లీరావు అంటాం. కోపం ఎక్కువ కదూ! మిసెస్ రావు మంచివారు. వున్నారా ?'' అని ముందుకు రాబోతుంటే నళిని సరుగు పెట్టింది లోపలికి.

రాజకుమారి టవలుతో చేతులు తుడుచుకుంటూ, ''ఇంతసేపు ఎక్కడికి వెళ్ళావని గాభరా చేసింది. దారి తప్పిపోయావనుకున్నాను'' అంటూ ముందుకు వచ్చింది. నళిని అన్నిటికీ తలూపుతూ ఏదో పని వున్నట్టు పైకి వెళ్ళింది. ద్వారంలో నిల్చున్న అజయ్, ''నమస్తే బాబీ'' అన్నాడు.

''ఎవ్వరూ ? అజయ్! రారా! ఏమిటీ తిరిగ్గా తిరుగుతున్నావు. ఇంకా సెలవుల్లోనే వున్నావా ?'' అంటూ పలుకరించింది.

''పప్పా వాళ్ళేరి ?'' అని అడిగాడు.

రాజకుమారి ఏదో చెప్పి, ''ఉండు. నింబు పానీ తాగిపోదువు'' అని అంటుంటే, తలుపు ప్రక్కనించి వింటున్న నళిని అక్క తనని పిలుస్తుందేమోనని భయపడుతుంటే, ''వద్దు బాబీ, ఈవినింగ్ వస్తాను ... ఏం. ప్రోగ్రాం లేదుగా ?'' అన్నాడు.

''అచ్ఛా! అలాగేరా'' అని బయటదాకా సాగనంపింది రాజకుమారి.

నళిని తేలిగ్గా వూపిరి పీల్చుకొని పడకమీద వాలిపోయింది. కలలా జరిగిపోయిన సంగతులను తిరిగ్గా మననం చేసుకోసాగింది.

**[ ఇంకా వుంది ]**

# చెమటకాయల యొక్క దురద, మంట బాధను మరిచి పోండి.







నైసిల్ పొందండి.
చెమటకాయలను మరువండి.
కేవలం 6 రూపాయల 63 పైసలు.*

*గరిష్ఠ రీటైల్ ధర. స్థానిక పన్నులు అదనం

చెమటకాయల పౌడర్ మాత్రమే మీకు దురదలు, మంటల చికాకుల నుండి అతి శీఘ్రంగా ఉపశమనము నిస్తుంది. ప్రత్యేకమైన ఔషధీయుక్త నైసిల్ చెమటకాయలను ప్రతి దశలోనూ ఎదుర్కొంటుంది.

1. అధికమైన చెమటను ఆపుతుంది.
2. చెమటను పీలుస్తుంది.
3. దుర్గంధకారియైన సూక్ష్మ జీవులను నాశనము చేస్తుంది.
4. శరీరమునకు ఉపశమనము నిస్తుంది.

Sista's-GN-79-364-Tel




# కానుక

శాలివాహన

'నా ధర్మాన్ని నేను నెరవేర్చాను' అంటున్నట్లు రైలు నాంపల్లి స్టేషన్‌లో ఆగింది.

అలసిపోయిన పాంథుడు ఉస్సురన్నట్లు ఇంజను బుస్సుమంటూ ఆవిరిని వదుల్తోంది.

తెల్లటి నీటియావిరి ప్లాట్‌ఫారమంతా కలియతిరుగుతోంది. వాతావరణమంతా బొగ్గు వాసనతో నిండిపోయింది.

నాంపల్లి స్టేషన్ నాకేం క్రొత్తకాదు. ఉద్యోగాన్వేషణలో మొట్టమొదటిసారిగా నేను కాలు పెట్టిందక్కడే. ఉద్యోగినై ఊరూరూ తిరుగుతున్నా, అప్పుడప్పుడూ ఆఫీసు పని మీద ప్రభుత్వంవారి భత్యంపై హైద్రాబాదు వెళ్తూనే వుంటాను. వెళ్ళినప్పుడల్లా స్టేషన్‌లో దిగగానే స్టేషన్‌ను ప్లాట్‌ఫారంపైని ప్రతి భాగాన్ని పరిశీలిస్తున్నట్టు కలియతిరగటం నాకు అలవాటు.

కాని, ఈసారి రైలు దిగి అక్కడే నిలబడిపోయాను. ఏదో తెలియని పెద్దతనమూ, ఎందుకో తెలియని హుందాతనమూ నాలో చోటుచేసుకున్నట్లు అన్పించింది.

నాకు అభిముఖంగా నడిచివస్తున్న రాంబాబును చూసి నా కళ్ళు ఆనందంతో వెలిగాయి.

"బాబాయ్!" అంటూ రాంబాబు నన్ను చుట్టేశాడు. అతని బాహువుల్లో నా లావుపాటి శరీరం క్షణంసేపు నలిగిపోయింది. అతని పరిష్వంగం వెలిబుచ్చే ఆప్యాయత, ఆనందం నన్ను ఉక్కిరిబిక్కిరి చేశాయి.

రాంబాబు వెంటనే విడివడి, ఏదో స్ఫురించినవాడిలా "పిన్నిని తీసుకరాలేదేం బాబాయ్" అన్నాడు నిష్ఠూరంగా చూస్తూ.

"ఆవిడ ఆరోగ్యం ఏమంత బాగో లేదురా ... అందుకని..."

"నన్ను చాలా డిజపాయింట్ చేశావ్ బాబాయ్" అంటూ చేతిలోని సూట్‌కేస్‌ను తీసుకున్నాడు.

నేను హుందాగా అతని వెంట నడిచాను. స్టేషన్ బయటకు రాగానే 'టాక్సీ' అంటూ పిలిచాడు రాంబాబు.

టాక్సీ వేగంగా వెళ్తోంది. అంతకంటే వేగంగా నా మనస్సు గతంలోకి పరుగు తీసింది. పదేళ్ల క్రితం...

ఒక రోజు రాత్రి తొమ్మిది గంటల సమయంలో మా యింటి తలుపు తట్టేడు రాంబాబు. తలుపుతీసి చూసిన నాకు రాంబాబు రూపం ఆశ్చర్యాన్ని కలిగించింది. బాగా అలసిపోయి ఉన్నాడు. తొడుక్కున్న చొక్కా చెమటతో తడిసింది. చెప్పులులేని అతని కాళ్ళు మట్టికొట్టుకుని తెల్లని తొడుగు తొడిగినట్లుగా వున్నాయి.

నింపాదిగా అడగ్గా తెలిసింది, రాంబాబు ఇంట్లో పోట్లాడి వచ్చాడని. తండ్రి కాలేజీ చదువు చెప్పించనన్నాడట.

కావటానికి రాంబాబు నా అన్న కొడుకే. ఉమ్మడి కుటుంబంలోనివాడే. అయితే ఉమ్మడి కుటుంబాలలో సహజంగా తలెత్తే కలతలమూలంగా ఇటీవల రాకపోకలు తగ్గటమే కాకుండా మాలో మాకు ఉత్తర ప్రత్యుత్తరాలు కూడా ఆగిపోయాయి.



**సీత - రాము**

చిత్రీకరణలో నిమగ్నమైన ''సీత- రాము''

అనే సాంఘిక చిత్రాన్ని బోయిన సుబ్బారావు దర్శకత్వంలో జి. డి. ప్రసాదరావు, పి. శశిభూషణ్ ఆగస్ట్ 29న ప్రారంభించబోతున్నారు. సెప్టెంబర్ 21 వరకు రెండు షెడ్యూల్స్‌తో ఈ వర్ణ చిత్రం పూర్తవుతుంది. శంకర్‌నాగ్, జయసుధ, శ్రీధర్, గిరిబాబు, మోహన్‌ప్రసాద్, ప్రభాకరరెడ్డి, గోకిన రామారావు, జయమాలిని మున్నగు తారాగణం. పరుచూరి రచయిత సత్యం సంగీత దర్శకుడు. దేవరాజ్ ఛాయాగ్రాహకుడు. నవంబర్ విడుదల. ఇది శ్రీ సారథీ స్టూడియోస్ వారి 13వ చిత్రం. ఆ తర్వాత జనవరి 20 నుంచి హీరో కృష్ణతో మరో చిత్రాన్ని ప్రారంభిస్తారు.

## ఊటీలో "శృంగార రాముడు"

ఎన్. టి. ఆర్. ''శృంగారరాముడు''గా సత్యసాయి ప్రొడక్షన్స్ వర్ణ చిత్రం ఔట్‌డోర్ షూటింగ్ కాశ్మీర్‌లో జరిగిన తర్వాత ఇటీవల ఊటీలో మరికొన్ని సన్నివేశాలు చిత్రీకరించబడ్డాయి. లత, ప్రభాకరరెడ్డి, శరత్‌బాబు, అల్లు రామలింగయ్య, నళినీకాంత్, ముక్కామల, జయమాలిని, రమాప్రభ, పండరీబాయి పాత్రధారులు. డి. వి. నరసరాజు రచయిత. మహదేవన్ సంగీత దర్శకుడు. రాజారావ్ ఛాయాగ్రాహకుడు. కె. శంకర్ దర్శకుడు.



'శ్రీరామబంటు'లో గీత

## దేవుడు మామయ్య

శోభన్‌బాబు, వాణిశ్రీ, విజయలలిత ముఖ్య భూమికలు నిర్వహించే రాజా ఆర్ట్స్ ఎంటర్‌ప్రైసెస్ వర్ణ చిత్రానికి పై పేరు పెట్టారు. జి. రాజేంద్రప్రసాద్ నేతృత్వంలో డి. వెంకటరామయ్య, త్రినాథ్ నిర్మించే ఈ చిత్రానికి కె. వాసు దర్శకుడు.

# సినిమా

## సన్నాయి అప్పన్న

శ్రీ రమణ చిత్ర పతాకంలో చలం సమర్పించే "సన్నాయి అప్పన్న" వన్నెల చిత్రానికి జూలై 14న ప్రసాద్ స్టూడియోలో దాసరి నారాయణరావు తొలి క్లాప్, పంపిణీదారులు హరికృష్ణ కెమెరా స్విచ్ ఆన్‌తో ప్రారంభోత్సవం జరిగింది. దీపక్ దర్శకత్వంలో శోభన్‌బాబు, జయప్రద, ఈశ్వరరావు, నూతన్ ప్రసాద్, అల్లురామలింగయ్య, రావుగోపాలరావు, ధూళిపాళ, పి. ఎల్. నారాయణ, జి. వి. జి., చలం, రమాప్రభ పాల్గొంటారు పినిశెట్టి సంభాషణల కర్త. దేవులపల్లి, ఆత్రేయ, రాజశ్రీ, అప్పలాచార్య గీతాలకు జి. కె. వెంకటేశ్ స్వరకల్పన చేశారు. ఛాయ, శిల్పం, కూర్పులను జె. సత్యనారాయణ, సోమనాథ్, రవి నిర్వహిస్తారు.



'కళ్యాణి'లో మురళీమోహన్, జయసుధ

## అనంతలక్ష్మి ఇంటర్నేషనల్ తాజా చిత్రం

"ఆగస్టు 29న మా స్వగ్రామం కారంచేడులో షూటింగ్ ప్రారంభిస్తున్నాం," అన్నారు కట్టా సుబ్బారావు దర్శకత్వంలో వర్ణ చిత్రాన్ని ప్రారంభించే దగ్గుబాటి భాస్కరరావు. ఆ షెడ్యూల్ సెప్టెంబర్ 20 వరకు జరుగుతుంది. మరి షెడ్యూల్ అక్టోబర్ 1 నుంచి 20 వరకు. మురళీమోహన్, దీప, చంద్రమోహన్, జ్యోతి, నూతన్‌ప్రసాద్, పి ఎల్. నారాయణ, మణిమాల పాత్రధారులు. గుహనాథన్ కథకు సత్యానంద్ మాటలు రాస్తున్నారు. సత్యం, వెంకట్, జి. వి. సుబ్బారావు, మార్తాండ్ — సంగీతం, ఛాయ, శిల్పం, కూర్పులను నిర్వహిస్తారు.

## ద్రాక్షారామంలో బడాయి బసవయ్య

"జూలై 20 నుంచి ద్రాక్షారామంలో ఒకే షెడ్యూల్‌లో మా చిత్రం పూర్తవుతుంది," అన్నారు బోయిన సుబ్బారావు దర్శకత్వంలో "బడాయి బసవయ్య" చిత్రాన్ని సమర్పించే గుండా సత్యనారాయణ. శ్రీ శక్తి చిత్ర వారి ఈ చిత్రానికి బి. బి. చౌదరి, పి. ఎన్. ప్రకాశరావు నిర్మాతలు.

'ఊర్వశి నీవే నా ప్రేయసి'లో ఒక దృశ్యం



## అరంగణ్ణల్ కుమారుని పెళ్లి



తెలుగు తమిళ యువతీ యువకుల భాషాంతర ప్రణయ చరిత్ర సృష్టించిన శ్రీరామ అరంగణ్ణల్‌గారి ఇంట్లో భాషాంతర పరిణయం సుఖాంతమయింది మరో చరితం. అరంగణ్ణల్‌గారి పెద్ద కుమారుడు అశోక్, అతని మనసు హరించిన తెలుగు బాల పద్మావతి రిజిష్ట్రారాఫీసులో పెళ్ళి చేసుకొన్నారు. ఇల్లు చేరిన వధూవరులను శ్రీ అరంగణ్ణల్ దంపతులు ఆశీర్వదించారు

# నాటికీ - నేటికీ సాటిలేని మేటి నటి సావిత్రి



మరపురాని పాత్రలలో అద్భుతంగా నటించిన సావిత్రి (పైన బొమ్మలలో). క్రింద ఎడంప్రక్క బొమ్మ మాత్రం యింకా విడుదల కాకున్న గోరింటాకులోవిది

"నామీద చెలరేగినన్ని పుకార్లకు ఒకరైతే ఆత్మహత్య చేసుకునేవారేమో! నేను మొండిదాన్ని. నాలో పట్టుదల ఎక్కువ.... త్వరలోనే నా ఆత్మకథ రాయబోతున్నానులెండి" అంది సావిత్రి మందహాసంతో

పరమపద సోపానపటంలో నిచ్చెనలతోపాటు పాములూ ఉంటాయి. ఒక్కమారు జీవితంలో ఏదైనా దెబ్బతిన్నాక క్రుంగిపోతే, మళ్ళీ శక్తినంతా పుంజుకొని పైకి లేవడం అందరికీ సాధ్యంకాదు. పట్టుదల, మనోనిబ్బరం గలవారే అలాంటి పరీక్షలలో నెగ్గి, నిగ్గుదేరుతారు.

సెట్‌లో పాత్రల ఊహారూపకల్పనలలో మునిగి తేలుతూన్న సమయాన సైతం—ఒక్కోసారి అంతరాంతరాలలో విద్యుద్వేగంతో ఆలోచనా పరంపరలు తీవ్రంగా పరిభ్రమిస్తున్నా—పైకి నిబ్బరంగా, సుబ్బరంగా, నిండుగా, కదలని చల్లకుండలా నెమ్మదిగా, ప్రశాంతంగా, ప్రసన్నంగా ఉండగలదు సావిత్రి. నిజజీవితంలోనూ అంతే.

"నేనసలు నటి నవుతాననుకోలేదు మొదట్లో. అసలు సినిమా నటిగా నేను పనికి రానన్నారు ఆదిలో ఒకరిద్దరు. నాలో పట్టుదల పెరిగింది. నటిగా ప్రవేశించాను. హీరోయిన్‌గా ఎన్ని చిత్రాల్లో నటించానో నాకే గుర్తులేదు. దశాబ్దాలు గడుస్తూన్నా ఈ కళకు దూరం కాకుండా కేరెక్టర్ రోల్స్ వేస్తున్నాను. ఇప్పుడు తల్లి పాత్రలూ వేస్తున్నాను."

★ మరి; ఆమెలోని నటికి అది ఎంతవరకు తృప్తికరంగా ఉంది?

"నటనను తపస్సుగా భావించేవారికి తృప్తి అంటూ ఎప్పుడూ ఉండదు.. ఆ రోజుల్లో

### కాశ్మీర్‌లో ఏడంతస్తుల మేడ

దాసరి నారాయణరావు రచన, దర్శకత్వంలో 'యూనిస్ ఎంటర్‌ప్రైజెస్' వై. అరుణ్‌ప్రసన్న నిర్మించే వర్ణ చిత్రం షూటింగ్ జూలై 21 నుంచి కాశ్మీర్‌లో జరుగుతుంది. ఆగస్టు 20 నుంచి జరిగే రెండవ షెడ్యూల్‌కోసం అన్నపూర్ణ స్టూడియోలో రెండులక్షల రూపాయల వ్యయంతో "ఏడంతస్తుల మేడ" సెట్‌ను నిర్మిస్తారు. ఎ. బి. రాములు సమర్పించే ఈ చిత్రంలో ఎన్. ఆర్., జయసుధ, సుజాత, గీత, ప్రభాకరరెడ్డి, అల్లురామలింగయ్య, మోహన్‌బాబు, హరిప్రసాద్ ప్రభృతులు నటిస్తారు. నిర్వహణ: వాకర్ల కృష్ణ.

### దాసరి మళ్ళీ తెరముందు

"పెద్దిల్లు—చిన్నిల్లు" అనంతరం దాసరి నారాయణరావు మళ్ళీ ఒక విశిష్టమైన పాత్రను తారకప్రభు ఫిలిమ్స్‌వారి "ఎం. ఎల్. ఏ. ఏడుకొండలు"లో నిర్వహించనున్నారు.

### శంకరాభరణం

"జూలై 25 నుంచి ఆగస్టు 10 వరకు రాజమండ్రి పరిసరాలలో తొలి షెడ్యూల్ జరుగుతుంది," అన్నారు కె. విశ్వనాథ్ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో "శంకరాభరణం" వర్ణ చిత్రాన్ని నిర్మించే పూర్ణోదయా ఆర్ట్ పిక్చర్స్ అధినేతలు ఏడిద నాగేశ్వరరావు, ఆకాశం శ్రీరాములు. చంద్రమోహన్, జె.వి. సోమయాజులు, అల్లురామలింగయ్య గోకిన రామారావు, సాక్షి రంగారావు. భార్గవి వగైరా నటవర్గం. జంధ్యాల, మహదేవన్, వేటూరి, తోట, జి. జి. కృష్ణారావు సాంకేతికవర్గం.

### ఆగస్టు 15 న "టైగర్"

ఎన్. టి. ఆర్., రాధాసలూజా, రజనీకాంత్, సుభాషిణి, గుమ్మడి, వంకాయల, సావిత్రి, సాక్షిరంగారావు ప్రభృతులు పాల్గొన్న నవశక్తి పిక్చర్స్ వర్ణ చిత్రాన్ని నందమూరి రమేష్ దర్శకత్వంలో పి. నారాయణరావు నిర్మించారు. విద్వాన్ కణ్వశ్రీ, డి. ప్రభాకర్ సంభాషణలు సి. నారాయణరెడ్డి గీతాలకు సత్యం సంగీతం ఎస్. ఎస్. లాల్ ఛాయాగ్రహణం ఇతర ఆకర్షణలు. సమర్పణ: పి. నాగేంద్రబాబు.

### గాడిదకు తెలుసా కర్పూర వాసన?

కోతి తర్వాత గాడిద ప్రధానపాత్ర వహించే "పంచకల్యాణి" అనే తమిళ చిత్రాన్ని యు. ఎం. పిక్చర్స్ వారు నిర్మిస్తున్నారు. ఆ గాడిద పేరు కల్యాణి. ఇంటికి కావలసిన సామాన్లను ఒక కాగితం మీద రాసి ఈ గాడిదకు ఇస్తే, ఆ కాగితాన్ని తినేయకుండా సరాసరి ఒక కొట్టుకి వెళ్ళి, ఆ లిస్ట్‌లోని సరకులను తీసుకురావడంలాంటి పనులు చేస్తుంది ఈ కల్యాణి. ఒకసారి ఆ కొట్టు ఆసామీ కర్పూరం బదులు ఉప్పును పొట్లంగా కట్టి ఇస్తే, ఆ వాసన పసిగట్టి, ఆ పొట్లాన్ని అక్కడే పడేస్తుంది ఈ గాడిద.

[ 38వ పేజీ చూడండి ]

# "మా అబ్బాయిని ఉన్నతోద్యోగిగా చేస్తాను"

కన్నాంబగారిని తల్లి వేషాలకు బుక్ చేస్తే, ఆమె ప్రతిభను వినియోగించుకునే రీతిలో ఆ పాత్రను ప్రత్యేక శ్రద్ధతో మలచేవారు అలాంటి పాత్రలే నాకూ లభిస్తే, అంతకన్నా ఆనందం ఏముంటుంది ? అయితే, ఇప్పుడు ''గోరింటాకు, రంగూన్ రౌడి, నా ఇల్లు – నావాళ్ళు'' చిత్రాలలో నాకు నచ్చిన ఒక్కని పాత్రలే లభించాయి 'చందనబొంబె' అనే కన్నడ చిత్రం, 'శిఖరం, అవళొరు కావ్యం' అనె తమిళ చిత్రాలలోనూ ప్రస్తుతం నటిస్తున్నాను ఈనాడు హీరో ఓరియంటెడ్ పిక్చర్స్ ఎక్కువగా తయారౌతున్నాయి హీరోవర్షిప్ ఎక్కువైంది కదా ? హీరోను దృష్టిలో ఉంచుకొనే మిగతా పాత్రలను రూపొందిస్తున్నారు అప్పుడు చిత్ర నిర్మాణ పద్ధతులన్నీ పూర్తిగా మారిపోయాయి కదా ? చిత్ర నిర్మాణంలో 'వేగం' ఒక్కటే కనిపిస్తోంది స్థిరత్వం కనిపించడంలేదు కాలానుగుణంగా ఈ 'వేగం' అవసరమే కాని, దీనికీ ఓ హద్దు ఉంటూ ఉండాలి కదా ? ఆ రోజుల్లో పూర్తి స్క్రిప్టు సిద్ధమయ్యేవరకు సెట్స్‌కు వెళ్ళేవారు కాదు తక్కువ చిత్రాలలో నటించడంవల్ల ఆర్టిస్టులు తమ తమ పాత్రలపై పూర్తిగా దృష్టి కేంద్రీకరించి నటించడానికి వీలయ్యేది అలాగే చిత్రంలో చెప్పదలచుకున్నదేదో ప్రేక్షకుల మనస్సులకు హత్తుకునేలా చిత్రీకరించేవారు అందుకే ఆనాటి చిత్రాలలోని కొన్ని సంఘటనలను ఈనాటికీ కొందరు తలచుకొని ఆనందిస్తున్నారు కాని, ఈనాటి చిత్రాలలోని సంఘటనలను హాలు దాటి బయటకు వచ్చేసరికే మరచిపోతున్నారు సాంకేతికంగా మాత్రమే నేటి చిత్రాలు పురోగమించాయి నటన విషయంలో మాత్రం ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్లుంది ఒకే రోజు రెండు మూడు చిత్రాలలో నటించడంవల్ల ఆర్టిస్టులకు ఏ పాత్రమీదా దృష్టి లగ్నమవడం లేదు ఇంకా బాగా నటించాలనే తపన ఎవరిలోనూ కానరావడంలేదు షూటింగ్ అయిందంటే ఒయిందనిపించుకొని, ఎప్పుడెప్పుడు వెళ్ళిపోదామా అనే ఆదుర్దాలోనే ఉంటున్నారు పైగా, ఈ సబ్సిడీవల్ల ఏం ఒరుగుతుందో నాకు తెలియదుగాని, ఔట్‌డోర్‌లో తయారయ్యే చిత్రాల సంఖ్య ఎక్కువైంది ఆ తర్వాత వాటికి డబ్బింగ్ ఒక రబుల్ వర్క్ రికార్డింగ్ థియేటర్లు సమయానికి దొరకవు అవి దొరికితే ఆర్టిస్టులు దొరకరు అంతా హడావిడి ''

★ మళ్ళీ ఏ చిత్రానికైనా దర్శకత్వం వహించే ఉద్దేశ్యం ఉందో లేదో !

''ఈ పరిస్థితుల్లోనా ?'' సావిత్రి నవ్వింది 'చక్కని స్క్రిప్ట్ ఒకటి సిద్ధంగా ఉందేగాని, దర్శకత్వం చేబట్టితే నేను నటించే కొన్ని చిత్రాలు వదులుకోవలసివస్తుంది అది వీలుకాదు కదా ? పైగా, నేను అలనాటి స్కూల్ ఆఫ్ పర్‌ఫెక్షన్‌లో శిక్షణ పొందినదాన్ని, ఈ 'వేగానికి' తట్టుకొని, ఇప్పటి వాతావరణానికి అడ్జస్ట్ కాగలనా అని నా సందేహం.. అసలా రోజుల్లో నేను నటిగా, దర్శకురాలిగా బిజీ అయిపోవడంతో కొంత కాలం పాటు నా కుటుంబ బాధ్యతలపట్ల నా దృష్టి నిర్లక్ష్యం జరిగింది ఫలితంగా నావాళ్ళే నన్ను అపార్థం చేసుకున్నారు ఏ కుటుంబంలోనైనా ఇది సహజమే కదా ? అందుచేత, ఇకమీదటైనా ఇంటి బాధ్యతలపట్ల ఎక్కువ శ్రద్ధ వహించాలని నిశ్చయించాను ''

★ ఇంతకీ, ఆమె జీవితాశయం ?

''మా అబ్బాయి సైన్స్ స్టాండర్డ్ చదువుతున్నాడు వాడ్ని విద్యాధికుడ్ని, ఉన్నతోద్యోగిని చేయాలని ఉంది ఏ తల్లికైనా ఇలాంటి జీవితాశయం సహజమే కదా ?'' అంది సావిత్రి నవ్వుతూ

సావిత్రి ఎన్ని సత్కారాలకైనా, సన్మానాలకైనా, మన్ననలకైనా, బిరుదులకైనా అర్హురాలనిపిస్తుందెవరికైనా

ఆ మహానటి జీవితం చరితార్థమైనది

—జి వి జి



# బొమ్మల మహాభారతం దుర్యోధనుని ప్రాయోపవేశం మండపాక సీతారామాంజనేయులు

( గత సంచిక తరువాయి )

























[ఇంకా ఉంది]

గ్రటూ స్టీలు సామాను. మరో ప్రక్క చిన్న ఫ్రిజ్

''అదిగో అది కిచెన్...''

కిచెన్ అనబడే ఆ గదిలో ఎత్తుగా అరుగు, అరుగుమీద గాస్ స్టవ్. రెండు వైపులా వున్న అల్మరాలలో నీట్‌గా ఎర్చిన పాత్ర సామాను ఊరగాయ జాడీలు, పప్పు డబ్బాలు...

''ఇది మా బెడ్‌రూం.'' లక్ష్మి ముసి ముసిగా నవ్వింది. ఆమె కళ్లలో సిగ్గు పొంతరలు ... అక్కడ నాకు కన్పించినవి డబుల్ కాట్, వాటిమీద డన్‌లప్ పరుపులు, పైన సీలింగ్ ఫేన్, గోడలకు ఖజురాహో శిల్పాల ఫోటోలు. ఒక ప్రక్కగా గాద్రెజ్ బీరువా, మరో ప్రక్కగా చెక్కబీరువా.

లక్ష్మి చెక్కబీరువా తెరిచింది. అందులో రెండు అరలనిండా పిల్లల ఆటవస్తువులు. ఎన్నిరకాలో! వాటిని చూస్తూనే కవిత వాటి మీదకు ఎగబడింది.

''ఇప్పుడుకాదమ్మా, తర్వాత ఆడు కుందువుగాని'' అంటూ కవితను వాదగ్గర్నుండి తీసుకుంది లక్ష్మి.

తిరిగి డ్రాయింగ్‌రూంలో కొచ్చి వాలుకుర్చీలో మేను వాల్చాను. లక్ష్మి సీలింగ్ ఫేన్ ఆన్‌చేసింది. ఫేను గాలికి టేబులుపై వున్న కొండపల్లి కీలుబొమ్మ వయ్యారంగా వూగుతోంది. బొమ్మ ప్రక్కనేవున్న రేడియో -- కం -- టేప్ రికార్డర్‌లోని టేప్‌ను ఆన్‌చేసి వంటింటి వైపు నడిచింది లక్ష్మి.

చిట్టిబాబు వీణానాదం మధురంగా వీనులకు సోకుతోంటే ఫేను గాలి చల్లగా మేనును స్పృశిస్తుంటే రాత్రంతా రైల్లో నిద్రలేదనే విషయం జ్ఞప్తికొచ్చింది నా మనస్సుకు

నిద్రలేచేసరికి పన్నెండైంది. ఎప్పుడొచ్చాడో రాంబాబు, డైనింగ్ హాల్లో కూర్చుని లక్ష్మికి కబుర్లు చెప్తున్నాడు. లక్ష్మి అదేపనిగా నవ్వుతోంది.

ఆ గుసగుసలు, నవ్వుల కిలకిలలు వింటుంటే ప్రేమించి పెళ్లి చేసుకోవడం లోని మధురిమ ఇదేనేమోననిపించింది నాకు.

నేను నిద్రలేచినట్లు వారికి తెలిసేలా పెద్దగా ఆవులించాను.

''లేచావా బాబాయ్! భోంచేద్దామా?''

బాత్‌రూంకు వెళ్లొచ్చి భోజనానికి కూర్చున్నాను. విస్తరి చుట్టూ ఏడెనిమిది



'అమ్మ ఎవరికైనా అమ్మ'లో శ్రీప్రియ

## కానుక

[ 25వ పేజీ తరువాయి ]

గిన్నెలు. వాటినిండా స్వీట్స్, కూరలు, పప్పు, సాంబారు, చారు; విస్తరిలో పులిహోర, వడియాలు, అప్పడం ...

''ఒరేయ్ రాముడూ, కవిత పుట్టినరోజు ఇవాళేనా ?''

''రేపు.''

''మరి ఇవాళ ఈ ఆర్భాటమేమిట్రా.'' వడ్డించిన పదార్థాల వైపు చూస్తూ అడిగేను.

''ఆర్భాటమేంవుంది బాబాయ్! రాకరాక వచ్చిన చీఫ్ గెస్ట్‌వికదా మరి ?''

''ఇదంతా చూస్తుంటే రేపు ఇంకా ఆర్భాటం చేసేలావున్నావ్. ఇలా దుబారా చేస్తే ఎలా ?''

''వండర్! బాబాయ్, నువ్వేనా మాట్లాడుతున్నది? నీ అలవాట్లు నాకు తెలియవా? సంక్రాంతి పండుగ రోజు రెండో స్వీట్ చేయలేదని పిన్నిని కేకలేయడం, పూర్ణం సరిగా తడిసేట్లుగా బొబ్బట్లపై నేయి పోయలేదని ప్లేట్ అవతలకి నెట్టడం, నీతోపాటు అందరికీ సక్రమంగా జరిగేలా చూసే నీ సమతాదృష్టి — వీటితో పోలిస్తే ఇక్కడ మేంచేసింది చాలా అల్పం బాబాయ్!'' రాంబాబులో ఆ జ్ఞాపకాలు ఇంకా ఎంత స్పష్టంగా ఉన్నాయి!

''అత్తయ్య చేసిన బొబ్బట్లు తినాలని వుంది మావయ్యా!''

''అలాగేనమ్మా. ఒరే రావుడూ, కవితను తీసుకుని మీరిద్దరూ ఉగాదికి అక్కడికి వచ్చేసేయండి... కాని, నాకో భయం లక్ష్మీ! మీ అత్తయ్య బొబ్బట్లు చేయడంలోనే కాదు, పోట్లాడటంలోకూడా ఆరితేరిన ఘటం. ఆవిడ పెట్టే కోడరికం నీవు తట్టుకోగలవా అని.''

''ఏవిటి మావయ్యా, అత్తయ్యను సూర్యకాంతంలా చిత్రిస్తున్నారు, ఆవిడ ఎంతో మంచిదైతేను ?'' చిరుకోపంతో నావైపు చూసింది లక్ష్మి.

''నీకెలా తెలుసు? రావుడు చెప్పేడా?''

''నాకెవరూ చెప్పలేదు. మనిషిని ఆమాత్రం అంచనా వేయలేననుకున్నారా నేను ?''

నాకు ఆశ్చర్యంగా వుంది. తాను చూడ లేదు, భర్త చెప్పగా వినలేదు. మరి ఎక్కడో వున్న రాజ్యంను సరిగా ఎలా అంచనా కట్టింది ?

పాపం, రాజ్యం ఎన్నో ప్రయత్నాలు చేసుకుంది; హైద్రాబాదు వచ్చి కోడల్ని, మనుమరాలిని చూడాలని.

అనుకోని అతిథిలా అప్పుడప్పుడూ వచ్చే ఆయాసం, దగ్గు రాకుండా వుంటే ఈ రోజు తాను ఇక్కడ వుండి కోడలితో సరస సంభాషణలు చేస్తుండేది. స్వయంగా కొనితెచ్చిన బంగారు గొలుసును మనుమరాలి మెడలో అలంకరించి మురిసిపోయేది. తీవ్రంగా వచ్చిన దగ్గు, ఆయాసం అన్నిటికీ ఆటంకాలైనాయి. దగ్గరుండి చేయించుదా మనుకున్న గొలుసును వ్యవధిలేక ''అక్కడే




ఉత్తేజం చిందే ఆ వ్యాఖ్యలను
మీరు రాబట్టేందుకే మరి

# మదురా బట్టలు

మదురా కోట్స్ ఉత్పాదన

మదురా సౌత్ ఇండియా కార్పొరేషన్ (ప్రై.) లిమిటెడ్ 68, మూర్ స్ట్రీట్, మద్రాసు 600 001. శ్రీ లక్ష్మీ టెక్స్‌టైల్స్ బెసెంట్ రోడ్, గవర్నర్ పేట, విజయవాడ 520 002.

376 TEL

# తొక్క వొలిచిన ఉల్లాసం




నారింజ రుచిగల

**బ్రిటానియా డిలైట్** కరకరల్ల కమ్మదనం నింపుకొన్న బిస్కట్



కొని పిల్లకిచ్చిరండి'' అని నాకు పురమాయించి పంపింది.

కాని ... కాని ... రాంబాబు వెయ్యి రూపాయలు తీసుకున్నాడు. వాడు తిరిగి ఇచ్చేదెప్పుడో, నేను గొలుసు కొనేదెప్పుడో! డబ్బు ఇవ్వమని నేనెలా అడిగేది రాంబాబును? ఏ అవసరానికి వాడుకున్నాడో! బాకీ తీర్చమన్నట్లుగా ఎలా అడగటం?

ఎంతో మథనపడినమీదట వాడుగా ఇచ్చేవరకూ రాంబాబును వెయ్యిరూపాయల సంగతి అడగకూడదని నిర్ణయించుకున్నాను.

మర్నాడే కవిత పుట్టినరోజు. ఉదయమే తలంటి, స్నానంచేయించి కూతురికి కొత్త గౌను తొడిగింది లక్ష్మి. కవితచేత నాకు నమస్కరింపజేసి ఆశీస్సులిప్పించింది.

సాయంత్రం వాళ్ల ఆఫీసు మిత్రులంతా వచ్చారు. అందరికీ స్నాక్స్, టీ యిచ్చారు రాంబాబు దంపతులు. అందరినీ పేరు పేరునా పలుకరించి అతిథి మర్యాదలు జరుపుతుంటే వచ్చినవారందరూ సంతసించి తాము తెచ్చిన కానుకలను కవిత కిచ్చి వెళ్లిపోయారు.

స్నాక్సే పెట్టేరని, స్వీట్లు హాటు దండిగా పెట్టలేదని కొరవగా తలపోసింది నేనొక్కడ్నేనేమో.

ఆ మర్నాడు రాంబాబు ఇండస్ట్రియల్ ఎగ్జిబిషన్‌కు వెళ్దామని ప్రోగ్రాం వేశాడు. అందరం బయల్దేరాం. ఐదింటికి వెళ్లిన మేము రాత్రి పదిగంటలవరకూ తిరుగుతూనే వున్నాం. కన్పించిన ప్రతి స్టాల్ దగ్గరా ఆగి అక్కడవున్న వస్తువుల వివరాలను అడిగి తెలుసుకుంటూ కాంటీన్‌లో స్వీట్స్ తింటూ టీలు త్రాగుతూ, పిల్లల రైలు ఎక్కి తిరుగుతూ, ఫొటోలు తీయించుకుంటూ ఆనందంగా గడిపేము. అయితే అడుగడుగునా నాకు మనసులో బాధగానే వుంది. తెల్లవారితే ఊరికి వెళ్లిపోవాలి. ఇంతవరకూ రాంబాబు డబ్బు ప్రసక్తి తేలేదు. వాడు డబ్బు ఇచ్చేదెప్పుడు, నేను నగ కొనేదెప్పుడు, కవితకు అలంకరింపచేసేదెప్పుడు?

నగ సంగతి అలావుంచి చిన్న ఆటబొమ్మ కొనిద్దామన్నా పర్సులో డబ్బు లేదు, వున్న ముప్పై చార్జీలకు జాగ్రత్తచేయగా.

ఇంత దూరం నుండి కవిత పుట్టినరోజుకంటూ వచ్చి పిల్లకు ఏ కానుకా ఇవ్వకుండా వెళ్తే ఎలా? వాళ్లు ఏదో అనుకుంటారని

# కానుక

కాదు, ఇలా జరిగిందని తెలిసి మనుమరాలికి ఏమీ యివ్వలేకపోయినందుకు రాజ్యం ఎంత బాధపడుతుందో!

కాని, చేసేదేమీ కన్పించలేదు.

''ఒరే రావుడూ, నీకిచ్చిన వెయ్యి రూపాయలూ పెట్టి కవితకు గొలుసు చేయించరా'' అని రైలెక్కే ముందు రాంబాబుకు చెప్పి వెళ్దామని నిర్ణయించుకున్నాను. కాని ...

రాంబాబు నాకా అవకాశాన్ని కూడా కల్పించలేదు.

ముందుగానే రిజర్వ్ చేయించిన ఫస్ట్ క్లాస్ కంపార్ట్‌మెంట్‌లో నన్ను కూర్చోబెట్టి ''పిన్నిని అడిగేనని చెప్పు బాబాయ్!'' అన్నాడు.

## మనవి

మా కార్యాలయానికి వచ్చే కథలు, కార్టూన్లు పంపేవారుకూడా వాటితో పాటు తగినన్ని తపాలాబిళ్లలంటించిన స్వంత చిరునామాగల కవరు వుంచడం మంచిది. వాటిని తిరిగి చేతికి అందివ్వడం సాధారణంగా జరుగదని మనవి. సం.

నేననుకున్నది చెప్పాలని అనుకుంటుండగానే ''ఇప్పుడే వస్తా బాబాయ్! ఇదిగో ఈ పుస్తకం పట్టుకొనివుండు'' అంటూ హడావిడిగా ఎక్కడికో వెళ్లేడు.

రైలు బయలుదేరే టైమైంది. గంట కొట్టేరు. గార్డు విజిల్ వూది, పచ్చజెండాను విదిలించాడు. రైలు కదిలింది. రాంబాబు రానేలేదు. ఇంకా వస్తాడనే ఆశతో నేను ప్లాట్‌ఫారం పైకి చూస్తూనేవున్నాను. కాని రాంబాబు రాలేదు.

''ఎందువల్ల రాలేదో ఏమో'' అనుకుంటూ నిరాశతో కూర్చుని అప్రయత్నంగా చేతిలోవున్న పుస్తకాన్ని తిరగేస్తుంటే అందులోనుంచి ఒక కవరు నా వళ్లో పడింది.

దాని పైన నా అడ్రసే వుంది. కవరు చివర్న చింపి లోపలి ఉత్తరం బయటకు తీశాను. ఆ ఉత్తరానికి డ్రాఫ్ట్ ఒకటి జత చేయబడి వుంది. లాల్చీ జేబులో నుండి కళ్ళజోడు తీసి తగిలించుకుని ఉత్తరం చదవటం ప్రారంభించాను.

''బాబాయ్! నీ ప్రయత్నానికి అడ్డు తగిలి నీ మనసుకు బాధ కల్గించినందుకు క్షమించు. నాకు తెలుసు నీవే ప్రయత్నం మీద వచ్చావో. మనుమరాలికి ఏ నగో, నట్రో చేయిద్దామని వెయ్యిరూపాయలు అప్పుతెచ్చావ్ అవునా? నీ పరిస్థితులన్నీ నే నెప్పటికప్పుడు తెలుసుకుంటూనే వున్నాను. ఆర్థికంగా ఇబ్బందుల్లో వుండి కూడా నీ దొడ్డగుణాన్ని, అలవాట్లను మాత్రం నీవు మర్చిపోలేదు.''

''జీవితంలో ఎంతగానో నీకు రుణపడి వున్నాను బాబాయ్! అందుకని యింకా నా కుటుంబానికై నీచే ఖర్చుపెట్టించకూడదనుకున్నాను. మీ చల్లని మనసులలో మాకు చోటుంది. అంతే చాలు బాబాయ్! మమతానురాగాలు చాటుకోవాలంటే పెట్టుపోతలు తప్పనిసరికాదు బాబాయ్! పైగా ... చూశావ్ కదా కవితకు ఎన్ని ఆటవస్తువులున్నాయో, ఎన్ని రకాల దుస్తులున్నాయో? యిక నగలంటావా, చిన్నపిల్లలకు నగలుంచటం సిటీలలో ఎంత ప్రమాదమో నీకు తెలుసు. అలాంటప్పుడు కవితకై నీవు ఖర్చుచేయటం అనవసరం కదూ! నీ ప్రయత్నానికి ప్రత్యక్షంగా అడ్డుచెప్పి నిన్ను ఒప్పించే నేర్పు లేక, అవసరమని చెప్పి నీదగ్గర వున్న డబ్బంతా తీసుకుని అది ఖర్చుకాకుండా ఆపగలిగేను. నా ఈ పన్నాగం లక్ష్మికి కూడా చెప్పి ఆమె తోడ్పాటు కూడా తీసుకున్నాను. నీనుండి తీసుకున్న డబ్బుతో ఆరోజే నీ పేర డ్రాఫ్ట్ తీసుకున్నాను. అది ఈ కవరులోనే వుంది. ఇంటికి వెళ్లి చేసిన అప్పు తీర్చేయమని రిక్వెస్ట్ చేస్తున్నాను. ట్రైన్ బయలుదేరేలోపల నీవు డబ్బు విషయం ప్రస్తావిస్తావని అనుమానించి, నీకా అవకాశం కల్గించకుండానే ట్రైను బయలుదేరేవరకూ ప్లాట్‌ఫారంపై ఉండదల్చుకోలేదు. చదువు చెప్పించి, నా కాళ్లమీద నేను నిలబడేలా చేసిన నీ ఔదార్యాన్ని - బ్రతికినన్నాళ్లూ స్మరించుకునే --

నీ, రాంబాబు''



'మండే గుండెలు'లో కృష్ణ, జయప్రద

## సినిమా

### డైరెక్టర్ కొమ్మినేని చిత్రాలు

వాశిరాజు ప్రకాశం నిర్మించే అప్సర ఆర్ట్స్ వన్నెల చిత్రం "బొమ్మల కొలువు" 4వ షెడ్యూల్ జూలై 15 నుంచి 20 వరకు జరిగింది.

పింజల ఆనందరావు నిర్మించే ఆనందలక్ష్మి ఆర్ట్ మూవీస్ "మహాశక్తి" వర్ణచిత్రానికి జ్యోతిలక్ష్మి, జయమాలిని సోదరీమణులు తొలిసారిగా పాల్గొన్న నృత్యం జూలై 5న చిత్రీకరింపబడింది.

రామకృష్ణ సినీ స్టూడియోస్ పతాకంలో ఎన్. టి. ఆర్. జనవరిలో ప్రారంభించే వర్ణచిత్రానికి, భాస్కర చిత్రవారి తాజా చిత్రం, సింహపురి యునైటెడ్ ఆర్ట్స "మేనత్త కూతురు", బాబ్ అండ్ బాబ్ ఆర్ట్స కొత్త చిత్రానికి కొమ్మినేని దర్శకుడు.

### "బొట్టు కాటుక"

విజయబాపినీడు నేతృత్వంలో మాగంటి రవీంద్రనాధచౌదరి నిర్మించే పై చిత్రంలో మురళీమోహన్, శ్రీధర్, నూతన్‌ప్రసాద్, జయంతి, మాధవి, నిర్మల, అనిత, బేబీ ఇందిర ప్రధాన తారాగణం. జంధ్యాల రచయిత. చక్రవర్తి సంగీత దర్శకుడు. జి. కె. రాము ఛాయాగ్రాహకుడు. సత్యం ఎడిటరు. దుర్గా నాగేశ్వరరావు దర్శకుడు. ఆగస్ట్ 5న చాటపర్రులో షూటింగ్ ప్రారంభమవుతుంది. అక్కడ అదే రోజున శ్యామ్‌ప్రసాద్ ఆర్ట్ ప్రొడక్షన్స్ "విజయ" చిత్రం నూర్రోజుల వేడుకలూ జరుగుతాయి. ✪

చూపుకి
అందం
కంటికి
చలవ
అదే
# ఐటెక్స్
కాటుక



స్థానికమైన ఉత్తమ తైలముల మూలికల మిశ్రమంతో శాస్త్రరీత్యా తయారైనది ఐటెక్స్.




పెట్రోలియమ్ జెల్లీగాని, మైనం గాని, ఏ విధమైన రంగుగాని చేర్చబడనిది ఐటెక్స్.

కళ్ళకు కాంతి, చలవ ఆకర్షణలను కల్పించుటలో సాటిలేనిది ఐటెక్స్.

35 ఏళ్లగా మీ అపార విశ్వాసమునకు ఒక చిహ్నము ఐటెక్స్.

మీ సౌందర్యమునకు మీ కన్నులే జీవనాడి. దానికి సాటిలేని ఉత్తమమైన కాటుకనే వాడాలి అదే ఐటెక్స్ కాటుక అని వేరే చెప్పాలా?

ARAVIND LABORATORIES MADRAS 600 033

**10-8-1979 శుక్రవారం మొదలు**
**16-8-1979 గురువారం వరకు**

# వారఫలం

**మేషం:—** అన్ని రంగాలలో ప్రసిద్ధి, అభివృద్ధి చేకూరే వారం. నారం వారం ముందుకుపోయి, యంత్ర సంబంధ, రచనావ్యాసంగ, పత్రికా చలన చిత్రరంగ ప్రసిద్ధి ఉంటుంది. తలంచిన పనులు అలాగే నెరవేరే మార్గం ఉంటుంది. 12, 14తా. ఆదాయానికి, ప్రగతికి సర్వవిధాలా అనుకూలం. స్త్రీలకు : వివిధ రంగాలలో వారికి, ముఖ్యంగా ఉద్యోగస్థులకు చాలా బాగుంటుంది.

**వృషభం:—** ఇంకా పరిస్థితులు అన్ని విధాల మెరుగ్గా ఉంటుంది. అభివృద్ధి చెప్పటం అంతగా లాభదాయకంగా ఉండదు. తప్పులు చేయటం సాధారణమై పోతుంది. ఎంతవరకు కృషి చేయటమే మీ బాధ్యత. సర్వసాధారణంగా, చేసే వృత్తిలో ఏ మాత్రం ఇబ్బంది లేదు గాన మీ కార్యక్రమం మీరు నెరవేర్చండి. స్త్రీలకు : అభివృద్ధి, ఉద్యోగ ప్రయత్నాలలో నిమగ్నమైన వారికి వృద్ధి కద్దు. ప్రమోషన్ కలదు.

**మిథునం:—** చాల విధాల మీరు ప్రయత్నిస్తే మీరు అభివృద్ధి ఉంటుంది. ఉద్యోగ, వ్యాపార విస్తరణ కార్యక్రమం అభివృద్ధి దాయకం. ఎవరినీ నమ్మరాదు. హితోక్తులు చెప్పేవారిని మాత్రం నమ్మరాదనేటట్టున్నట్లక, కొందరు పనులు నెరవేర్చు కొనుటకు, ఎన్నిపనులైనా చెయవచ్చు. స్త్రీలకు: ఉద్యోగం. అభివృద్ధి, వ్యాపార, కళారంగంలో వివిధ రూపాల వృద్ధి వుంటుంది.

**కర్కాటకం:—** పత్రిక, చలనచిత్ర, వ్యాపార, భూసంబంధంగా లాభదాయకం. రచనా వ్యాసంగంలో ఉన్నవారు, పండితులు, ఉపాధ్యాయ వృత్తిలోనివారికి అందరంగా తేర్పడుతాయి. ద్రవ్యాదాయం అనుకోకుండా సంభవం. ఇతరుల పరిస్థితులు గమనించి మీరూ అలాగే నడుచుకోవాలి. ఉపకారాలను దిగనాడు, అంతంత మాత్రం పనులు చేయ్యరాదు. లాభదాయక వ్యవహారాలలో మాత్రమే తలదూర్చండి. స్త్రీలకు : ఈ వారం అభివృద్ధి సూచకం.

**సింహం:—** రాశిలో రాహు—శని స్థితి ఆరోగ్య విషయంలో పట్టి చూస్తారు. ఐశ్వర్య విషయంలో అంత పట్టింపు చూపరు. 11, 13 తారీకులు ద్రవ్య లాభదికి దోహదం చేస్తాయి. అన్ని విధాలా యోగం, అనుకూలం. రాజకీయ అభివృద్ధి కనిపించేవారం. స్త్రీలకు : ఏ విధంగా బాగుంటుందని చెప్పడానికి గ్రహస్థితి అమరిఉండలేదు.

**కన్య:—** ప్రశాంతంగా జీవితం గడపటం నేర్చుకోవాలి. అలా శాంతంగా ఉండటం చేత మీ పనులన్నీ నెరవేరుతాయి. ఇంకకొన్ని రోజుల్లో మీ కార్యాలన్నీ నెరవేరే గ్రహస్థితి. ఆదాయం, అప్రయత్నంగా ద్రవ్యలాభం ఉంటుంది. స్త్రీలకు : ముఖ్యరంగాలలో, ఉద్యోగంలో మేలైన దినాలు, మాటకుమన్నన సమకూడే వారంగా భావించండి.

**తుల:—** వారం అనుకూలం. ద్రవ్యాదాయం ఉంటుంది. అభివృద్ధి మార్గాలుంటాయి. ప్రయత్నలోపం చేయకండి. హితుల మాటలు, పెద్దమార్గము నకు లాగే వచ్చితే, పట్టించుకోకండి. ఎవరు ఏమన్నా, ఏమైనా, కృషివదలరాదు. సోమరిగా సాముచేయరాదు. అభివృద్ధికి సోపాన దినాలు చాల సమీపంలో ఉన్నాయని గ్రహించండి. స్త్రీలకు : నూతన మార్గాలలో అభివృద్ధి.

**వృశ్చికం:—** సుఖశాంతులకు ఆకరమయ్యే వారం కాదు. ప్రతివారం యిలాగే ఉంటుందనుకోరాదు. కొన్ని గ్రహాలే కలున్నాయి, కొన్ని మార్గాలలో ధనాదాయ దానికి పూనుకున్నారు కదా, అవి సఫలమయ్యే వారాలు ముందున్నాయి. ఏది ఏమైనా, జీవిత విధానంలో పెద్దగా మార్పులు రావు. స్త్రీలకు : వివిధ రంగాలలో సామాన్య ప్రయోజనం ఉంటుంది. ఆరోగ్యలోపం కనిపిస్తుందిగాని, పెద్దగా బాధాకరంగాదు.

**ధనుస్సు:—** సుఖము, ఆనందం, హాయి అభివృద్ధి, మాట చలామణి గౌరవభాజనమైన వారం. ఏ వృత్తిలో ఉన్నా, ఏ పనిచేసికొంటున్నా, పట్టుదల మాత్రం ప్రదర్శించటమే మీ వంతు. ఫలితం దైవానుగ్రహం వల్ల సమకూడుతుంది. మీరు తెలివిగలవారని యిష్టం వచ్చినట్లు ప్రవర్తించరాదు. గ్రహాల అధిక్యత గల సమయం. ఇబ్బంది లేదు. స్త్రీలకు : సమాజంలో గౌరవం కద్దు.

**మకరం:—** అష్టమ స్థానంలో శని, రాహు వుల స్థితి, ఈ వారంలో రెండు రోజులైనా మీకు కష్టం కలిగించకమానవు. మంత్ర తంత్ర జపాద లవసరం. అంత మాత్రమే గాక ఔషధ సేవన కూడా అవసరమే. స్త్రీలకు : ఉద్యోగ, వృత్తి, వ్యాపారానుకూలత అధికంగా కనిపిస్తుంది. కొందరకు జీవన భృతి యేర్పడే అవకాశం ఉంది. గృహభారం అధికం స్త్రీలకు ఈ రాశివారికి ముఖ్యంగా అనిగ్రహించండి.

**కుంభం:—** లగ్న, కేతువు ఏమి మంచిచేస్తాడు? దానికితోడు అంగారక శనులు కూడ అనుకూలురు కారు. క్రొత్తగా పనులు ప్రారంభించరాదు. అట్లని, సామాన్యంగా చేసే పనులు మానుకోరాదు. ముఖ్య బంధువులలో కపటిగా వారో, ఆత్మీయులలో యింటికి రాకపోకలు సాగిస్తుంటారు. అదొక రీతి వ్యయం కదా! కాని, వ్యయంతోనే వారం గడిచిపోతుంది. స్త్రీలకు : గృహానందం.

**మీనం:—** రాశిలోని బాలులు. చాలమందికి వ్యాపారంచేసే వారికి అనుకూలం. ఆరోగ్యం సంభవం. అభినానుల లదుం, అనుభవాలుంటాయి. ద్రవ్యాదాయం, ఏదో ఒకరీతిని సంభవం. స్త్రీలకు: చేసే పనులందు ఏ విధంగా యిబ్బంది ఉండదుగదా! తలంచినపనులు తలంచినట్లుగా నెరవేరే గ్రహానుకూలత కలదు.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి.

*ఆఫీసులో గోడ గడియారం "టంగ్" మని గంట కొట్టింది! అటెండెన్సు రిజిస్టరులో సంతకం పెడుతూ గడియారం వేపు చూసేడు చెలపతి. గుండె ఝల్లుమంది. అరగంట లేటుగా వచ్చేడు తను.*

# అర్జంటు ఫైల్

ఓలేటి శ్రీనివాసభాను

పుట్టింటికి భార్య వెళ్ళడంవేత పూటంి సారి చేతుం కాల్చుకోవలసి వస్తోంది. అలవాటు లేని అవపోసన పడితే ఏదేదో జరిగినట్లుంది తన పని. ఆదరా బాదరగా గింజలు విసట్లోపోసి. బంగాళా దుంపల వేపుడుతో కూర అయిందనిపించి, ఉప్మాలా తయారైన అన్నాన్ని అడుతుంబడతూ దిగమింగి, విశాఖ వన్‌లో సిటీబస్సు పట్టుకుని దొండపర్తిలో దిగేసరికి, ఇంకేవుంది? అరగంట లేటయింది.

చెలపతి బస్సుదిగి పరుగు పరుగున ఆఫీసు మెట్లెక్కి హాల్లోకిరాగానే వాతావరణం ముదుచుకున్న గొంగళి పురుగులా వుంది. టైపిస్ట్ "టక టకలు" తప్ప మరోశబ్దం లేదక్కడ. ఉద్యోగపక్షులు మెడలు సాచి అతని వేపే చూస్తున్నాయి. ఆ చూపులు "ఒరే చెలపతీ నీకు చీవాట్లు ఖాయంరా" అన్నట్లున్నాయి.

బాస్ అసలే కొత్తవాడు హైదరాబాద్ హెడ్డాఫీసు నుండి ఈ మధ్యనే బదిలీ అయి వచ్చేడు. కదిలితే "కబడ్దార్" అనేరకం. అయిదు నిమిషాలు లేటుగా వస్తే చాలు సెక్షన్ ఇన్‌ఛార్జిలను సైతం సలక్షణంగా ఛార్జ్ చేసి, అనర్గళంగా ఆంజనేయ దండకం వల్లించినట్లు చీవాట్లేస్తాడు.

"బ్ర్ర్" మంటూ బాస్ రూమ్ దగ్గర బజర్ అరిచింది. అంతసేపూ వీధి ద్వారాన్ని అనుకుని తాపీగా చుట్ట కాలుస్తున్న అప్పన్న, సగంకాల్చిన చుట్టని ఆర్పి కిటికీ పొది గట్టున దాచిపెట్టి అయ్యగారి రూమ్‌లోకి వెళ్ళేడు.

చెలపతి గుండె ఓసారి ఆగి మళ్ళీ వేగంగా కొట్టుకుంది.

"అప్పుడు. లోనికి పిలుస్తాడు. రెండో పూటకీ రేపు ఉదయానికీ కూడా సరిపోయేలా కడుపునిండా చీవాట్లు పెడతాడు" అనుకుని, నాలుగు లంఖణాలు చేసిన వాడిలా డీలా పడిపోయేడు.

"పెద్దాయన రూమ్‌వేపే అలా చూస్తూ మీనమేషాలు లెక్కెట్టకయ్యా, నీపని కానీ" అన్నాడు గ్రేడ్‌వన్ రామ్మూర్తి.

రాబోయే పరిణామాలు ఎదుర్కోడానికి మానసికంగా సిద్ధపడుతున్నాడు చెలపతి. అలా సిద్ధపడుతూ, నిన్న సాయంత్రం మొదలు పెట్టి సగం దాకా పూర్తి చేసిన స్టేట్‌మెంట్‌ని బయటకుతీసేడు. ఎదురుగా వున్న ఏడుకొండల వాడి పటానికి దండం పెట్టి, చిత్తుకాయితమ్మీద 'శ్రీ...' అని రాసేడో లేదో అప్పన్న రానే వచ్చాడు. వస్తూనే "అయ్యగారు రమ్మంటున్నారు" అని చెప్పి సీరియస్‌గా చుట్టని తిరిగి వెలిగించాడు.

అగ్గిరావుడు పిలుస్తున్నాడనగానే టకోరామేశానికే అనుకున్నాడు చెలపతి. ప్రాణాలు పైకి ఎగిరిపోయి వెంటిలేటర్ ఊచల్ని పట్టుకుని ఫల్టీలు కొడుతున్నాయి.

"మరేం భయం లేదు. ఎదురు జవాబు చెప్పకుండా తిడితే నిన్ను కాదని ఊరుకో. మరీ శ్రుతిమించి పోతే క్షమించండి సార్ అనేసి చెవులు మూసుకో" అని సలహా ఇచ్చేడు రామ్మూర్తి.

"అవునవును" అన్నాడు కృష్ణారావు, సూర్యనారాయణ విసిరిన అగ్గిపెట్టె అందుకుంటూ.

ఆ సలహా విన్న టైపిస్టు ఫిలోమిన పిసరంత కొంగు నోటి కడ్డం పెట్టుకుని "కిసుక్కు"మని నవ్వింది.

వెనక నుండి పది మంది నెట్టితే సారె గదిలోకి అడుగు పెట్టిన పెళ్ళికూతురులా, అష్టవంకర్లు తిరిగిపోతూ చెలపతి అగ్గిరావుడి గదిలోకి దూరేడు.

బాస్ రివాల్వింగ్ ఛైర్‌లో వెనక్కి తిరిగి కూర్చున్నాడు చలపతి వచ్చిన అలికిడిని గమనించలేదు రేక్‌లో ఏదో కాయితం కోసం వెదుకుతున్నాడు.

"కొంపదీసి మెమో ఫారాల కోసం కాదు కద!" అనుకున్నాడు చెలపతి.

కొద్దిక్షణాల పాటు అలా నిలబడి ఇకతన రాకను తెలియజెయ్యాలనుకుని, దమ్మునీ ధైర్యాన్నీ కూడగట్టుకుని "గుడ్‌మార్నింగ్ సర్" అన్నాడు. ఫర్వాలేదు తన మాటలు తన మట్టుకు స్పష్టంగానే వినిపిస్తున్నాయి. నాలుక మీద తడి కూడా ఆరిపోలేదు.

చెలపతి గొంతు విన్న బాస్, "గుడ్‌మార్నింగ్ మిస్టర్ చెలపతి" అన్నాడు గిర్రున ఇటువేపు తిరుగుతూ.

"ఎక్స్‌క్యూజ్ మి సర్ అరగంట లేటయ్యేను" అనబోయి ముందు తనే కమిట్ కావడం మంచిదికాదని ఆలోచించి,

"పిలిచారట సార్" అన్నాడు.

"అం-నోయ్ టేక్ యువర్ సీట్' అని సైగ చేసేడు బాస్ వింటి బంలాంటి



కను బొమ్మలు పైకి ఎగరేస్తూ.

"హా— ఇక ప్రయివేటు క్లాసు పెడ తాడ్రా బాబూ!" అనుకుని, అరడజను కేప్ స్యూల్స్- అంగుళంన్నర పొ గుని, ఒకేసారి మింగినట్ను పెద్ద గుటక వేసి మిడిగుడ్లు పెట్టుకుని కూర్చున్నాడు.

సీలింగ్ మీద సన్ మైకాలో సీలింగ్ ఫేన్ రెక్కల నీడ తెగ్గోసిన బాతు రెక్కల్లా రెప రెప లాడుతోంది.

ఎడం చేత్తో పేపర్ వెయిట్ ని పట్టుకుని గుండ్రంగా తిప్పుతూ, కుడిచేతి మునివేళ్ళని కుర్చీ హేండిల్ మీద రాటిస్తూ,

"నువ్వు కథలు గట్రా రాస్తావట!" అని చాలా కేజువల్‌గా అడిగేడు. కాని, భయంతో చచ్చి సగమైపోయిన చెలపతికి "నువ్వీ మధ్య ఖూనీలు గట్రా చేస్తున్నావట!" అని అడిగినట్లనిపించింది. ఏం చెప్పాలో తోచలేదు.

"లేదు సార్" అంటే "అబద్ధం చెబుతున్నావు నువ్వు" అని అగ్గి రుద్రుడై పోతాడో, "అవున్సార్" అని చెబితే "అపరాధం చేస్తున్నావు సుమీ" అని సంజాయిషీ అడుగుతాడో అని తడబడ్డాడు.

నిజం చెప్పకపోతే మనసు ఒప్పుకోదు; అబద్ధం చెప్పడానికి నోరు రావటం లేదు. అయినా ఒకటా రెండా? ఆరు డజన్ల కథలు, పావు డజను నవలలు రాసేడు- అదీ కలం పేరుతోనో, పెళ్ళాం పేరుతోనో కాదు; తన పూర్తి పేరుతోనే. అందుచేత తటపటాయింపులకు స్వస్తి చెప్పి,

"ఏదో అప్పుడప్పుడు రాస్తూ వుంటాను సార్" అన్నాడు. "అపరాధాలు అప్పుడప్పుడు మాత్రమే చేస్తాను" అన్నట్లుగా!

"వెరీ గుడ్" అని చిన్న పాజ్ తీసుకుని, "ఇప్పుడూ పత్రికల్లో కథలూ అవీ చూడ్డమే తప్ప, ఆ కథలు రాసిన వాళ్ళని ఇంతవరకూ చూడనే లేదోయ్. అఫ్ కోర్సు నేను చూసిన పత్రికలు చదివిన కథలు చాలా తక్కువే ననుకో. ఒకటి అరా చదివుంటానేమో. అపార్థం చేసుకోకేం..." అని ఏదో చెబుతుండగా, హైదరాబాద్ నుండి ట్రంక్ కాల్ వచ్చింది. దానిని అందుకుంటూ,

"సాయంత్రం వీలుంటే మా యింటికి రావయ్యా" అన్నాడు బాస్.

*  *  *

# అర్జంటు ఫైల్

సాయంత్రం నాలుగున్నర అయింది.

రోజూ ఆఫీసు నుండి నేరుగా ఇంటికి పోయి కుంపటి రాజేసుకునే చెలపతి ఈ పూటకి హోటల్‌కి పోవాలని నిశ్చయించుకున్నాడు.

ఫైళ్ళ గుట్టలు దాటి పి టీ బస్సు పట్టుకుని తొందరగా యింటికి చేరుకున్నాడు. అయిదున్నర అయేసరికి నీట్‌గా తయారయి రీడింగ్ రూమ్ దగ్గర మూడో

## కర్తవ్యం వైకల్పికం

తలకు మించిన ఖర్చులు
తప్పనిసరి అవసరాలు
అప్పుడు అప్పులే శరణ్యం
ఆ తిప్పల నుండి విముక్తి శూన్యం!

ఇలా వ్యథలతో జీవన గమనం
బాధల వలయంలో గతుకుల పయనం
ఎందుకో మరి? అని సింపతీలేని వెతలు!
అవే నేటి మన సినిమా కతలు!

నేడు నైతిక పతనం కూడా
బ్రతుకు బాటలో ఓ సాధనం!
ఈ తుచ్ఛపు బ్రతుకెవరికి ఉద్ధరింపు?
కనుక వ్యక్తిత్వం తాకట్టు!
కర్తవ్యం బ్రాకెట్టు!

కినుక ఎందుకు?
మన పవిత్ర ధరిత్రి చరిత్రకిది
మాయని మచ్చ మాత్రమే కాదు,
స్వచ్ఛమైన కీర్తికి కళంకం!

— ద్రోణా పాండురంగశాస్త్రి.

నెంబరు సిటీబస్సు పట్టుకున్నాడు. అతని చేతిలో కొత్తగా అచ్చయిన తన నవల కాపీ వుంది దాని లోపల పేజీలో "అభినందనలతో— చెలపతి" అని బాపు ఫక్కీలో రాసేడు. రీడింగ్ రూమ్ నుండి వాల్తేర్ అప్ లేండ్స్ చేరుకుని అయ్యగారి బంగ్లా ముందు వాలేసరికి ఆరు గంటలయింది.

సాయంత్రం వేళ సముద్రుడి గాలికోసం ఆరుబయట కుర్చీలో కూర్చున్నాడు దొర. పక్కన మరో కుర్చీలో ఓ అందమైన అమ్మాయి కూర్చొని వుంది. మెరుగ్గా చూస్తున్న ఆ అమ్మాయికి ఇరవయ్యేళ్ళుండొచ్చు. తీరిగ్గా కూర్చుని సిగరెట్టు తాగుతున్న బాస్ చెలపతిని చూసి, టీపాయ్‌కి దన్నుపెట్టిన కాళ్ళని వెనక్కి లాగి కళ్ళతో నవ్వేడు. అప్రన్ను చేత మరో కుర్చీ వేయించేడు. చెలపతి కూర్చున్నాక తన ప్రక్కన కూర్చున్న అమ్మాయిని అతనికి పరిచయం చేసేడు.

ఆమె తన ఏకైక సంతానమని, పేరు సుహాసిని అని, హైదరాబాద్‌లో బి. ఏ. పరీక్షలు రాసి మొన్ననే వచ్చిందని చెప్పేడు.

"నమస్తే" అన్నాడు చెలపతి. అని లిప్తపాటు కూడా కాలేదు.

"మీ గురించి డాడీ కన్నా నాకే ముందుగా తెలుసు" అంది సుహాసిని.

"ఎలా తెలుసు?" అని చెలపతి అడగవలసిన అవసరం లేకుండానే,

"ఐ మీన్ మీరు రాసిన కథల ద్వారా మీ పేరు తెలుసు. పత్రికల్లో సాధారణంగా మీ కథలు మిస్ అవను; ఆల్మోస్ట్ అన్నీ చదివేవుంటాను" అంది సుహాసిని గల గల మంటూ.

"థాంక్యూ" అన్నాడు చెలపతి నమ్రతగా.

"మొన్న ఉగాది పోటీలో మీ నవలకి సెకెండ్ ప్రయిజు వచ్చిందిగా. పత్రికలో మీ ఫోటో, పరిచయం చూసి మా డాడీ ఆఫీసులోనే మీరూ పని చేస్తున్నారని తెలిసింది. రియలీ అయామ్ ఎస్టానిష్డ్..." అంది సుహాసిని.

"అంతేనయ్యా—అక్కడనుండి వచ్చింది మొదలు నిన్ను పరిచయం చెయ్యమని రోజూ ఒకటే చెప్పడం — ఇప్పటి కప్పుడు నీతో చెబుదామనుకుంటూనే మరిచిపోతున్నాను. ఫర్ దట్ ఐ హేవ్ బీన్ బేంగ్డ్ లైక్ ఎనీ థింగ్" అన్నాడు బాస్ నవ్వుతూ.

అప్రన్ను ట్రేలో పెట్టి మూడు గ్లాసుల జ్యూస్ తెచ్చేడు. చెలపతి తీసుకోడానికి సందేహించినా సుహాసిని బలవంతం మీద తీసుకున్నాడు. ఫ్రిజ్‌లోంచి తెచ్చినట్టున్నాడు జ్యూస్: చాలా చల్లగా వుంది.

గ్లాసుని ముఖానికి అడ్డం పెట్టుకుని తాపీగా సిప్ చేస్తున్న డాడీ కళ్ళల్లోకి వీలు చూసుకుని సూటిగా చూసింది సుహాసిని. పెద్ద పెద్ద పొజిషన్‌లోవున్న కుటుంబాల్లో వ్యక్తులు కళ్ళతో మాట్లాడుకుంటారని చెలపతికి తెలిసినా సుహాసిని చూపులకు

# మీరు కేవలం ఓ బల్బ్ కొనాలనుకుంటే, ధారాళంగా దేనినైనా కొనండి
# కాని ఉత్తమమైన నాణ్యతను మాత్రం కొనాలనుకుంటే,
# హెచ్ఎమ్‌టిని కొనండి



మంచి నాణ్యతగల బల్బులకై మీరు చూస్తున్నారా? అవి చాలా ఉన్నాయి—కాని మీరు అంతకన్నా ఉత్తమమైన నాణ్యత కావాలనుకుంటే మీకు ఒకటే మార్గం—హెచ్ఎమ్‌టి.

హెచ్ఎమ్‌టి బల్బ్ మిగతా వాటికన్నా ఎందుకు విశిష్టమైనది?

ఇతర ఉత్పాదకులకన్నా హెచ్ఎమ్‌టి కొన్ని ఉత్కృష్టమైన లాభాలను కలిగివుంది. హెచ్ఎమ్‌టి మాత్రమే తమంతట తామే బల్బు యొక్క అన్ని భాగాలను తయారు చేసే ఏకైక సంస్థ. అందుచేత ప్రతి దశలోనూ నాణ్యతను అదుపులో ఉంచేందుకు హెచ్ఎమ్‌టికి వీలౌతుందన్న మాట.

ఇంకా హెచ్ఎమ్‌టి వారు బల్బులు తయారుచేయడం ప్రారంభించక ముందే వారు, బల్బులను తయారుచేసే యంత్రాలను ఉత్పాదనచేస్తూ వస్తున్నారు. అందువలన కేవలం సాధారణ బల్బులు కాక విశిష్టమైన ఉత్తమమైన బల్బులు తయారుచేసే సాంకేతిక పరిజ్ఞానపు అధిక్యతను హెచ్ఎమ్‌టి కలిగివుంది.

అంతేకాదు, హెచ్ఎమ్‌టి వారు ఒస్రామ్ వారి—అంటే ప్రపంచంలో ల్యాంపులు తయారుచేయడంలో అత్యంత అనుభవం కలిగిన ఒకానొక విశిష్ట సంస్థ—అనుభవం విజ్ఞానం కలిగివున్నారు. ఇది హెచ్ఎమ్‌టి బల్బులకు అంతర్జాతీయ నాణ్యతనిస్తుంది.

ఇంకా హెచ్ఎమ్‌టి వారికి, వారి గడియారాలు యంత్ర పరికరాలు మరియు ట్రాక్టర్లు తయారుచేయడంలో 25 ఏళ్ళగా సంపాదించిన ఖ్యాతి వుంది. మరి ఆ ఖ్యాతినంతా వారు ఓ గాజు ముక్కపై పణంగా ఒడ్డుతున్నారంటే ఏదో వుందన్న మాటే మరి. వుంది మరి. మరింత ప్రకాశవంతమైన కాంతి. చిరకాలపు మన్నిక. ఇంకా ఉత్తమమైన నాణ్యత.

**hmt**



## హెచ్ఎమ్‌టి బల్బులు - మీ జీవితంలో వెలుగులు

Rediffusion/H/749 TL c

అర్థం మాత్రం అతనికి తెలియలేదు.

కూతురి గాఫాలు అర్థం చేసుకున్న బాస్ చెలపతిని చూసి,

"చెలపతీ! మా అమ్మాయి కూడా కథలూ అవీ రాస్తుందయ్యా" అన్నాడు.

"అలాగా సార్. ఏ పేరుతో రాస్తూంటారు?" అని అడిగేడు చెలపతి.

"సుహాసిని అన్న పేరుతోనే" అంది.

# అర్జంటు ఫైల్

"ఐ సి" అని ఓ క్షణం ఆగి, ఆ పేరు తనకి ఏ పత్రికలో తగిలింది చెప్మా అని ఆలోచనలో పడ్డ చెలపతితో,

"మా కాలేజీ మేగజైన్స్‌లో రాసేవాండి" అంది.

ఆమె కాలేజీ మేగజైన్స్ తను చదవక పోవడంలో తన తప్పేమాత్రమూ లేదని గ్రహించి "అమ్మయ్యా" అనుకున్నాడు చెలపతి.

"వైట్ ఏ మినిట్" అని ఇంట్లోకెళ్ళింది సుహాసిని. తిరిగి వస్తూనే వరండాలో లైటు వెయ్యమని అప్పన్నకి పురమాయించి ఓ మాదిరి లావుగల ఫైల్‌ని తెచ్చి టీపాయ్ మీద పెట్టింది.

ఆ బరువుకి టీపాయ్ సన్నగా మూలిగింది.

చీకటి విపరీత వలకి అప్పుడే సూర్యుడు దొరికి పోతున్నాడు.

* * *

సుహాసిని ఇచ్చిన ఫైలుని చంకలో పెట్టుకుని, కొన్నిన్ కేఫ్‌లో టిఫిన్ చేసి, చెలపతి కొంపకి చేరుకునేసరికి రాత్రి తొమ్మిదిన్నరయింది.

"ఈ కథలు చదివి అభిప్రాయాలు చెప్పాలట; ఇదెక్కడి హోమ్ వర్కురా చిట్టి తండ్రీ!" అని ఓ నిట్టూర్పు వదిలేడు. ఫైలు తెరిచే ఓపికలేక అల్మారాలో దాచి పెట్టి, బిస్తరు పట్టుకుని డాబా ఎక్కి పోయేడు.

మర్నాడు సుహాసిని కథల గురించి బాస్ అడిగితే రెండు మూడు రోజుల్లో చదివి చెప్తానన్నాడు.

వారం రోజులు గడిచేయి. బాస్ పాటి ఊసెత్తలేదు; "ఫర్వాలేదు" అనుకున్నాడు.

మరో వారం గడిచింది. "మరిచి పోయుంటాడు మరి భూచీ లేదు" అనుకున్నాడు.

ఇంతలో హెడ్డాఫీసు పనిమీద బాస్ హైదరాబాద్ వెళ్ళేడు. "ఇంకేం? పీడ విరగడయింది. మరో వారం రోజులు హాయి హాయి" అని ధీమా పడ్డాడు.

అలా ధీమా పడిన సాయంకాలం జగదంబాలో ఇంగ్లీషు బొమ్మ చూద్దామని బయల్దేరిన చెలపతి అక్కడ సరిగ్గా అవిరి పోయేడు.

గేటు దగ్గర సుహాసినికి దొరికి పోయేడు.

* * *

రాత్రి సినిమా నుండి వచ్చేక, కళ్ళనిండా ముంచుకొస్తున్న కమ్మటి నిద్రని టీ చుక్కలతో హతమార్చి, అలమరాలో ఫైలు బయటకు తీసేడు. తాపీగా ఒక్కొక్క కాయితం తిరగేసేడు. కవితలు, మినీకథలు, ఓ మాదిరి కథలు మొదలుకొని అయిదువారా

లకు సరిపోయే ఏభై పేజీల కథల దాకా వున్నాయి.

మతి చెడిన వాడి మాటల్లా మహ ఘోరంగ ఉంది దస్తూరి!

వాటిని చదవడానికి దశలవారీ పథకం వేసుకుని పదిహేను రోజుల్లో పూర్తి చేసేడు. ఒక్కొక్క దశ పూర్తయిన వెంటనే సుహాసినిని కలుసుకుని చర్చించేవాడు. ఆ చర్చల్లో బాస్ కూడా తల దూర్చి చిలవలు పలవలు చేర్చేవాడు.

ఆ కథల్లో కన్నీళ్ళు దోసిళ్ళతో. తప్ప బొట్లు బొట్లుగా ఎక్కడా కారలేదు. త్యాగాలకీ, తెగతెంపులకి అదుపు, పొదుపు అసలేలేదు. అందుచేత చెలపతి చాలా కథల్ని కాస్త నిర్మొహమాటంగా పక్కకి పెట్టి ఓ మాదిరిగా వున్న వాటికి మలుపులు మార్చి తిరిగి రాయించేడు.

"వీటిని పత్రికలకి పంపిస్తే ఎలా వుంటుందంటారు?" అనడిగింది సుహాసిని.

"బాగానే వుంటుంది" అన్నాడు చెలపతి.

"చెలపతి నీ దస్తూరీ ముత్యాలకోవలా వుంటుందోయ్ ... నువ్వు రాసి పంపితే తిరుగుండదు వాటికి..." అన్నాడు బాస్.

తనకి కుదిరిన దస్తూరి అభినందుకు కుష్టితుడయ్యేడు చెలపతి. సుహాసిని చేతిరాత కన్నా ఘోరమైనది తన నాసటి రాతేనని బాధపడి, ఆమె రాసిన కథల్ని ఫెయిర్ చేసి పత్రికలకు పంపించేడు. అందమైన దస్తూరి వల్ల తనకు కలిగిన అనర్థాలు చూసేక "అందము దుఃఖ హేతువు" అన్న ఆర్యోక్తికి అర్థం తెలుసుకున్నాడు.

ఈ చాకిరీ తట్టని కొత్తగా నెత్తిమీద పెట్టుకున్నాక— ఓ వేపు తన రచనా వ్యాసంగాన్ని మూటకట్టి అటక మీద పెట్టేడు. మరోవేపు కార్యాలయ పక్షులు "డాక్టరేట్ ఇన్ కాకాజీ" అని, "సుహాసిని పి. ఏ." అని కూతలు మొదలు పెట్టేరు.

ఇలా చెలపతి దారుణమైన చిత్రహింసల పాలౌతున్న సమయంలో సుహాసినికి అనుకోకుండా పెళ్ళి సంబంధం కుదిరింది. వరుడు బొంబాయిలో ఎకౌంట్స్ ఆఫీసరు. పెళ్ళి దివ్యంగా జరిగింది.

అన్నీ బావున్నాయనేసరికి అసలు కథ అడ్డం తిరిగింది. సుహాసిని అత్తవారింటికి వెళ్ళేనాటికి ఆమె రాసిన కథలు పుట్టింటికి తిరిగొచ్చేయి. భర్తతో బొంబాయి వెళ్తున్న ఆనందం సుహాసినిలో ఫేడౌట్ అయిపోయింది.

ఓదార్చేడు చెలపతి. పెద్దవాళ్ళ కథలు సైతం మొదట్లో పెద్ద మొత్తాల్లో తిరిగొచ్చినవే అని ధైర్యం చెప్పేడు. తిరిగొచ్చిన వాటిని తత్తిమ్మా పత్రికలకు పంపమని సలహా ఇచ్చేడు.

అమ్మాయి అత్తవారింటికి వెళ్ళింది.

రెణ్ణెల్ల తరువాత గాలి పీల్చుకున్నాడు చెలపతి.

కూతుర్ని బొంబాయిలో దింపెట్టి తిరిగి వచ్చేడు బాస్.

తిరిగి వచ్చిన వారం రోజుల తరువాత ఓ రోజు మధ్యాహ్నం చెలపతికి కబురు పెట్టేడు.

కబురు పెట్టి, "ఏమోయ్ చెలపతీ సుహాసిని లేదనా బొత్తిగా రావడం మానేసావ్" అనడిగేడు.

చెలపతికి బాస్ గదిలో ఏదో మార్పు కనిపించింది. టేబిల్ నిండా నానారకాల పత్రికలు గుట్టలుగా పేరుకుపోయున్నాయి.

అర్థమైంది చెలపతికి.

ఆఫీసు కాయితాల మీద సంతకాలు పెట్టకుండా, అర్జెంట్ ఫైళ్ళని సైతం బాస్ ఎందుకు నెగ్లెక్ట్ చేస్తున్నాడో బాగా అర్థమైంది.

"ఏమిటలా చూస్తున్నావ్? పత్రికల గురించా! పుత్రిక అత్తారింటికెళ్ళాక నాకు పత్రికలు అలవాటు చేసి మరీ వెళ్ళిందగా" అని నవ్వుతూ సొరుగులోంచి ఓ ఫైలు తీసేడు.

"... మరేంలేదు. నాలుగు రకాలు చదివేక నాకూ రాయాలనిపించింది. ఓ రెండు రాసేను. చదివి, సరిచూసి, ఫెయిర్ చేసి పెడుదూ..."

ఆ తర్వాత మాటలు మరి వినిపించలేదు చెలపతికి.

రివాల్వింగ్ ఛైర్‌లో బాస్ ఎక్కుపెట్టిన రివాల్వర్‌లా కనిపించేడు.

ఊబిలో కూరుకుపోయిన లేగదూడలా తన్నుకుంటోంది మనసు.

హఠాత్ పరిణామానికి మొద్దుబారింది మెదడు.

కాళ్ళకి, మెడకి తాళ్ళు కట్టి ఎవరో బలంగా అటూ ఇటూ సాగదీస్తున్నట్లనిపించింది.

అచేతనలో కూడా అతని చేతులు ముందుకు సాగేయి.

ఆ చేతుల్లో గుదిబండలాంటి బరువైన కథల ఫైలు!

ఫైలు మీద "అర్జెంట్" అని హెచ్చరిస్తూ ఎర్రటి అక్షరాలు!!









ఏ ఆర్. వివి. — వెల్లంపల్లి

సృష్టిలో స్త్రీల హక్కులు, విధులు, పురుషుని హక్కులు, విధులు వేరువేరుగా నిర్ణయించినా— మీరు మాత్రం స్త్రీ పురుషులు సమాన హక్కులు అని కంట శోష ఎందుకండీ?

సృష్టి కోసం ప్రత్యేకతలు సృష్టించాడే గాని భగవంతుడు—పురుషాధిక్యతనేం నిర్ణయించ లేదే? ఆడది లేకుండా సృష్టి లేదు. మగవాడు లేకుండా సృష్టి లేదు. మరింక మిగిలిన వాటిలో తేడాలు దేనికి?

కె ఏ.ఆర్. — రాజమండ్రి

భర్త దేవుని మనువు భార్య పూజా మనువు
పతి సేవలో సతికి పరమ పదము
ఇల్లాలు చిరునవ్వే ఇంట వెలిగే దివ్వె
వోర్పు రక్షణయమ్మ వో రామలక్ష్మి.
* వోర్పు రక్షణ అయితే ఈ బానిసత్వము ఏల?
ఇల్లాలు దీపమైతే గుడ్డి దీపాలు దేనికి?
దీన్ని బట్టి చూస్తే తెలియడం లేదా?
కంచే చేను మేస్తోందని! అదే రివాజైందని!

సి హెచ్. వి.ఎస్. — విడదవోలు

పెళ్లయి 18 సంవత్సరాలు అయింది. ఇప్పుడు ప్రతి చిన్న విషయానికీ కలహాలు వస్తున్నాయి. జీవితం అంటే విరక్తి కల్గుతోంది.

స్త్రీ కనుక మీరిలా అనుకుంటున్నారు. అదే పురుషుడు అయితే పెళ్లి పెళ్లి గురించి, యింకో చిన్నిల్లు గురించి కొత్త కోర్కెలు పెంచుకుంటాడు. వయస్సుతో పాటు వచ్చే వేయినవ్వ ఇంగితం కలవాళ్ళు ఇది తెలిసి సంతోషంగా సర్దుకుపోవడం అలవరచుకుంటారు. జీవితం సాఫీగా సాగుతుంది. పిచ్చిగాని భర్తగారికి నిజంగా తెలియనా భార్య తనకంటే వయస్సు తక్కువదని!

వి.వి.ఎస్ ఆర్. — ఇచ్ఛాపురం

పుస్తకం వనిత విత్తం పరహస్తం గతంగతః అంటారు ఎంత వరకు నిజం?

పుస్తకం వరకు నిజం — చిత్రంగా చెప్పకలను. నిజమైన మిత్రులు పట్టుకెడితే డబ్బు నిశ్చితంగా తిరిగి వస్తుంది. స్త్రీ సజీవ పదార్థం కదా? రాడం పోవడం ఆమె ఇష్టా ఇష్టాలమీదనే ఆధారపడి ఉండాలి. మరి

కె. వి.ఎస్.ఆర్. బరంపురం

అత్తా కోడళ్ల మధ్య నలిగే వ్యక్తికి మీ సలహా?

రెప్పెంనక, తానొవ్వక తప్పించుకు తిరుగడము ఒక దారి. పరిష్కారము ఆలోచించి ఒక్క గదిలో నా మాటా ఒంట గదిలో నా మాటా సాగిపోవడం ఇంకో దారి

ప్రసాద్ — నూజ్వీడుపేట

పురాణాలు రాసింది మగవాళ్ళు. అందువల్లనే ఆడపాత్రలకు అన్యాయం జరిగింది అంటుందొక స్నేహితురాలు.

చాలా మటుకు నిజమే.

కాత్యాయిని — కన్యాకుమారి

వివేకానంద స్మారక మందిరం ముందర ఇప్పు రూపముగా కన్పించిన అమ్మ శారదాంబలో మీ చెప్పలేని కనుబడుటకు కారణం?

చంపేరు! నేను చాలాచాలా సాదాసీదా మనిషిని. నా పూహలు ఆకాశానికి కాదు గోడ కనీసం చెట్ల శిఖరాగ్ర శాఖల దాకా కూడా పాకవు! దేవుడు మంచి అప్పి మరిచి సరిగ్గా అర్ధనా. కళ్ళు మూసుకుని నిలబడలేదు. ఏ పనిచేస్తూన్నా కాస్తోకూస్తో స్వార్థపు ఆలోచనలు తప్పించుకోవు. నా మొగుడు నా యిల్లు నా పిల్లలు అంటా లోయే, మనసూ, విజ్ఞానమూ కూడా పూర్తిగాలేదు నాకు. పిచ్చి అభిమానం అలా అనిపిస్తుంది— కృష్ణుని అంటే ఎన్.టి ఆర్. అని పిల్లలు చెప్పేస్తే ఏమో చెప్పలేను యింకొంతమంది వచ్చాక బాలకృష్ణుడు ఏ వెన్నకుండో అన్నట్టే చెప్తే పెద్ద మార్పు జరుగుతుందో చూసుకోవాలి? వాళ్ళు పోకపోయినా ఒక్కింత మాతగా చెప్తే ఏం ఉండుంటారు? ఏమో మహాల రూపాల్లో కాదు కాత్యాయినీ, అప్పుడప్పుడు చూడవలసినది మారిజీవితాల్లో.

ప్రపుల్ల — ధర్మవరం

అప్పడాల కర్ర, వంట గరిటె, చెంబుపి మీ స్త్రీల ఆయుధాలా? వాటితో మీరు ఎవరిపై తిరగబడ్డారు. ఏమి సాధించారు?

మరీ నీలా చూసి దడుసుకుని దాక్కొని ఉన్నారే! కొర్కాటివట్టు మీకు అదారిటి. హిహిహిహి!

కె.ఆర్, ఆర్. — ఇబ్రహీంపట్నం

నాతో చదువుకున్న ఆడపిల్లలకి పెళ్ళిళ్ళు అయిపోయాయి. తలకొంచలి అంటే సిగ్గుగా ఉంది.

మీరు అన్నాయన్న సంగతి మంచిపోయినట్టుంది. పదరు దాటితే అమ్మాయి పడుచు పిల్ల. పదగు దాటినా అబ్బాయి కింకా పసివాడు మీసరే రేవు. లోకం ఏం తెలుస్తుంది? అందుకే మానసికంగాను శారీరకంగాను కూడా స్త్రీలు త్వరగా పెరిగిపోతారు.

జగన్ — నిజామాబాద్

మేము రాస్తున్న ప్రశ్నలకు మీరు జవాబులు రాయటంలో మీ ఉద్దేశ్యం ఏమిటి?

మీరు రాస్తున్నారు. నేను యిస్తున్నాను. అంతే! సరదాగా వచ్చితే మెచ్చండి. నచ్చకపోతే తిట్టండి—నేను మీరు పెద్దవాళ్ళగా — మెచ్చుకోలూ, తిట్లు, కోల్లూ ఒకటే నాకు. పొగిడారని ఉబ్బిపోను. తిట్టారని ఢీలా పడిపోను.

**బి.జి.ఆర్. — సౌత్ మోపూరు**

స్త్రీ ప్రేమ ఎంత కుసుమ కోమలమో అంత భయంకరం. ప్రేమించకుండా ఉండలేం. ప్రేమించి బ్రతకలేం. దీనికి సలహా?

అందులోనే ఉంది థ్రిల్. మరి ఎన్నుల్లిప్ప పాములా సాగిపోయే సంసారాల్లో ఏముంటుంది దైనందిన చర్యలా, లాభనష్టాలు బేరీజులు వేసుకోడాలూ తప్పించి. నిజమైన ప్రేమికుల జీవితం కత్తి మీద సామే. సాఫీగా సాగడమే అరుదు. సాగడం మొదలైతే కాళ్ల కింద కత్తుల్లా ముళ్లూ మంటలూ ఏవీ వాటికి లెక్కకాదు. అదే ప్రేమకి ఉన్న శక్తి. మోహానికి లేని శక్తి.

**వి.ఎస్.ఎస్. — హైదరాబాదు**

జీవితంలో విజయాలు సాధించాలంటే ?

గౌరవ ప్రదస్థానికి తొందరపాటూ దాన నిరతికి వత్తినడకా అలవాటు చేసుకోవాలి. అంటే చేతులు జోడించడం త్వరగా చెయ్యాలి. పర్సు తియ్యడం లేటు చెయ్యాలి. అదీ కిటుకు!

**కె వి ఆర్.కె — పాలకొల్లు**

జీవితమంటే ఏమిటి అక్కా?

వెలుగు నీడల పడుగు పేకలు వేసే కలనేత.

**కె జి ఎస్. — కర్నూలు**

భారతీయులంతా నాసోదరీ సోదరులు. మరి విదేశీయులు?

సాటి మానవులు.

**జి.ఎస్ వి. — పెనుమండ్ర**

ఎదుటి వారు పచ్చగా వుంటే చూసి ఓర్వలేరు. బాధ. కుళ్ళు, పైకితేలి పోతారు. ఎందుకలాఅనుకుంటారు?

అది మానవ బలహీనత. కాస్త అసూయపడడం సహజమే. కాని, బాధపడి పోడం, చేతకానితనం. అనిపించుకుంటుంది.

**ఎస్.టి.పి.ఎస్. — వేములవాడ**

దేవుడు మన్ని పుట్టించాడు. మనం దేవుణ్ని సృష్టించాం. దేవుణ్ని ఎందుకు పూజించాలి?

సింపుల్. దేవుడు మిమ్మల్ని పుట్టించ లేదు కనుక!!

**డి.జె.జె. — హైదరాబాదు**

పై చదువులు చదవాలని యిష్టం కాని మనస్సుకి ఏకాగ్రత ఉండటం లేదు.

చదువుకి ఏకాగ్రత అక్కర్లేదు. విజ్ఞాన సముపార్జనకి కావాలి. డిగ్రీ కావలిస్తే పోస్టులో కూడా వచ్చేస్తుంది చిట్టి తల్లీ. ఈ రోజుల్లో కూడా అంత బెంగ ఎందుకు ?

**వి.వి ఆర్. — ఖర్గపూరు**

కలకత్తాలో సినిమా హాళ్లకంటే పరిశ్రమలు ఎక్కువ అని చెబితే విజయవాడలోని ప్రజలు నమ్మలేకుండా ఉన్నారు. కామెంట్ ప్లీజ్?

మరి గిరీశంలా కోస్తున్నారు కలకత్తా పెద్ద మురికి పేట. అక్కడేముందో కనుక్కోవడం కష్టం.!

# సామెతల కథలు

## ముక్కూ-చెవులూ కోసి

అవమానపర్చటం అని చెప్పటానికి బదులుగా పలుకుబడిని ఉపయోగిస్తాం. దీనికి మూలం శూర్పణఖ కథ.

శూర్పణఖ రావణాసురుని చెల్లెలు. ఆమె కొడుకు జంబుకాసురుడు (జంబుకుమారుడు). అతడి తండ్రి విద్యుజ్జిహ్వుడు. జంబుకాసురుడు దేవతలపై పగబూని, వాళ్ళపై పగ తీర్చుకోటానికి ఇంద్రుణ్ణి గురించి తపస్సు చేసాడు. ఇంద్రుడు ప్రత్యక్షమై 'చంద్రహాస'' అను ఆయుధాన్నిచ్చాడు. జంబుకాసురుడు దానితో తృప్తిపడక, ఆ ఆయుధాన్ని తీసుకొని, 'పంచవటి' యందు ఘోర తపస్సు చేసాడు. అతడి చుట్టూ వెదుళ్ళు పెరిగాయి. ఆ చెట్ల, చేమల మధ్యలో అతడెవరికీ కన్పించక తపస్సు చేస్తుండగా, వనవాసం చేస్తున్న లక్ష్మణుడు, ఆ చోటుకు పండ్లకోసమని వెళ్ళాడు. పండ్ల కోసమని వెళ్ళిన లక్ష్మణుడు, అక్కడున్న మునుల కోరికపై వెదురుపొదను నరికాడు. వాటితోపాటు మధ్యనున్న జంబుకాసురుణ్ని కూడా నరికాడు అది లక్ష్మణుడు చూడక పొరపాటున చేసిన పని.

తన కుమారుని చావుకు నరులు కారణమని తెల్సుకుని, అతణ్ని హతమార్చాలని వచ్చింది శూర్పణఖ. అక్కడ శ్రీరామచంద్రుణ్ణి చూచింది అతణ్ణి మోహించింది. తన కోరికను తీర్చమని అతడి వెంటబడింది శ్రీరామచంద్రుడు తాను ఏకపత్నీవ్రతుడననీ, తన భార్యతో అక్కడ ఉంటున్నాననీ చెప్పి, ఆమెను వదిలించుకోటానికి లక్ష్మణుని వద్దకు పంపాడు.

మోహావేశంలోనున్న శూర్పణఖ లక్ష్మణుని చూచి, తన కోర్కెను తీర్చి సుఖపడమని అతడి వెంటబడింది. లక్ష్మణుడు విన్నా చెప్పి చూసాడు. తన కొడుకును చంపినవాణ్ణి హతమార్చాలని, ప్రతీకారావేశంలో వచ్చి, మోహావేశంతో గ్రుడ్డిదైన శూర్పణకు అతడి మాటలేవీ చెవికెక్కలేదు. నరులిద్దరూ తనను నిరాకరించటానికి కారణం సీతాదేవని, ఆమెను బాధించటం మొదలెట్టింది లక్ష్మణుడు సహించలేకపోయాడు. శ్రీరామచంద్రుని అనతితో, శూర్పణఖ ముక్కూ చెవులూ కోసి వికృతరూపిణిగా చేసాడు లక్ష్మణుడు. ఈ కథపైనే ఈ పలుకుబడి వచ్చింది

ఇదే, సీతను రావణుడు ఎత్తుకుపోవటానికి నాంది.

— పద్మావతీ గంగాధర్



క-సాధ్యమైన పనిని చేయవలెనని నిశ్చయించినప్పుడు దానిని సాధించడానికి సర్వ ధాలా ప్రయత్నం చెయ్యవలసి ఉంటుంది. ఆ కార్యంపట్ల అశ్రద్ధ చూప కూడదు. "యత్నేకృతేయదినసిద్ధ్యతికోఽత్ర దోషః" అని మనం శాయశక్తులా ప్రయత్నం చేద్దాం. జరుగుతే జరుగుతుంది. జరగకపోయినా-మన ప్రయత లోపం లేదని కొంత తృప్తి అయినా కలుగుతుంది-అని అనుకోకూడదు. "ప్రయత్నం చేసి ఆ పని జరిపితీరుతాం" అనే ధీమా ఉండాలి. అలా ఉన్నప్పుడే గట్టి ప్రయత్నం చెయ్యడం సాధ్యమవుతుంది.

చాల పట్టుదలఉన్న వ్యక్తి ఎవరైనా కావచ్చు. ఏట్టి పనినైనా సాధించగల సామర్థ్యమూ ఉండవచ్చు. కాని, ఒకటికి మించి ఎక్కువ పనులను ఒక్కసారి ప్రారంభిస్తే మాత్రం ఏ పనినీ తృప్తిగా పూర్తిచేయడం సాధ్యం కాదు. పనిని చేసేటప్పుడు మనస్సును దాని పైనే కేంద్రీకరించాలి. చెదరుపాటు ఉండ కూడదు. నాలుగు కార్యాలను ఒక్కసారిగా సాధించ సంకల్పించినప్పుడు మనస్సు నాలుదింటి పైకీ పరుగెత్తుతుంది. అంటే

## ధర్మపథం

తన స్థిరత్వాన్ని కోలుపోతుందన్నమాట! మనస్సు స్థిరంగా ఉన్నప్పుడే సామర్థ్యానికి బలం ఏర్పడుతుంది. సామర్థ్యం తక్కువైతే అధైర్యం ఏర్పడుతుంది అందువల్ల పట్టుదల సడలిపోతుంది కార్య హానికూడా కలుగుతుంది.

పరోపకార పరాయణులైన ఉదార హృదయులు అనేకవిధాల శక్తిసామర్థ్యా

## లక్ష్యసాధన

ఉన్నవారు దాక్షిణ్యం కొద్దీ తమర్ని యాచించినవారి కార్యాలను సఫలం చేస్తామని వాగ్దానాలు ఇస్తారు. కాదనకుండా అడిగినవాళ్ళకు వాగ్దానం చేసే వీరికి మనస్సు వేర్వేరు పనులపై ప్రసరించడం మూలానే నిలకడగా లేకపోగా ఏ పనీ అరకొరగా ఉంటుందేగాని పూర్తికావడం సాధ్యం కాదు.

కార్యసాధనలో కదలికలేని మనస్సు ఉండాలంది మన ప్రాచీనులు చెప్పినదే! ద్రోణాచార్యులవారు ఒక చెట్టుపైని భాసమనే పక్షిరూపాన్ని నిలిపి, దానిని కొట్టమని శిష్యులను అడిగినప్పుడు ఒక్కొక్కరినీ "నీకేమి కనబడుతున్నది?" అని అడగ్గా; పిట్టే కాకుండా కొమ్మలూ, ఆకులూ మొదలైనవి కనబడుతున్నాయన్నారు. "మీరు దాన్ని కొట్టలేరు" అని వారినివారించి, అర్జునుణ్ణి అడగగా "నాకు ఆ పక్షి తప్ప మరేమీ కనబడలే"దన్నాడు. అంటే అతని మనస్సు దానిమీదనే కేంద్రీకృతమై ఉన్నదన్నమాట! "సరే! నీవు దాన్ని కొట్టగలవు" అన్నాడు గురువు. అర్జునుడు దాన్ని కొట్టాడు. మిగిలిన అందర్నూ సిగ్గుపడ్డారు.

అందువల్ల మనస్సు నిలకడగా ఉంటేనే కాని ఏ పనీ సాధించలేము. ఆ నిలకడకు ఏదో ఒక పనినే ప్రారంభించాలి. అది సంతృప్తికరంగానే ముగిస్తేనే కాని, మరొక పనిని తలపెట్టకూడదు. తలపెడితే ఏదీ సరిగా నెరవేరదు

—బులుసు వేంకట రమణయ్య

---

# అస్థిర ప్రభుత్వం వినా మార్గం లేని స్థితి

తనం చూపించి వెలుపలికి దూకలేదు. (జూలై 22), "జనతాలోనే ఐతే నెం 2. లేదా ప్రధాన ప్రతిపక్షంలో నెం. 2" అనుకున్నాడాయన.

కాంగ్రెసు. ఐ జనతా(యస్)కి "జై" అంటే, "కాంగ్రెస్" "స సేమిరా" అంటుంది— 'కాంగ్రై' 'జై' అంటే ఆ పార్టీకి చవాన్ కాంగ్రెసు ఎసరు పెట్టేస్తుంది- ఇదంతా ఒక ఎత్తు. పార్లమెంటులో మొట్టమొదటిసారి చిల్లరమల్లర పార్టీలు- "బరిదీరిన బంట్లు"కి మల్లే— చిన్న గ్రూపుల్ని ఒక ఆట పట్టిస్తున్నాయి! "వామపక్షాల ఫ్రంట్" అంటూ వుంటే అదో 42 అవుతుంది- యివిగాక అన్నాడియమ్‌కే నాయకత్వాన తతిమ్మా ప్రాంతీయ పార్టీలున్నాయి— వీళ్లంతా కలిసి మరో 50 దాకా వుంటారు— "మహారథు లందర్నీ" తమ చుట్టూ తిప్పుకోగలరు.

## చరణ్ పన్నాగం

చరణ్‌సింగ్‌గారు ప్రాంతీయ పార్టీలు + కాంగ్రెసు(యిందిరమ్మా)లేకవామపక్షాలు + కాంగ్రెస్సు (యస్)— ఏదైతే "నేను నిలబడగలనా" అన్న మీమాంసలో పడి కొట్టుకుంటూనే "ప్రధాన ప్రతిపక్ష నాయకునిగా నన్ను గుర్తించండి ప్రభుత్వ యేర్పాటుకు నన్ను "కేకేయండి" అని రాష్ట్రపతి చెవి నిల్లు గట్టుకుని "పోరాడారు."

( 4వ పేజీ తరువాయి)

ఐతే ఎవరు ప్రధానమంత్రి పదవిని చేజిక్కించుకున్నా "యిండిపెండెంట్ సభ్యులు కూడా వో చెయ్యి వేస్తే తప్ప అవసరమైన "మెజారిటీ" రాగల సూచనలు జులై 24 దాకా కానరాలేదు— పైగా 'ఆయారామ్'లు 'గయారామ్'లు ప్రధాన పార్టీలలో అంత ఉషారుగా లేరు— యిదొక్కటే విచిత్రంగా తోచిన సంగతి! గ్రూపుల బలాబలాలు "కప్పల తక్కెడ మేళంగా" ఏ క్షణాన ఐనా మారొచ్చు.

మైనారిటీలో పడిపోయి అసన్నసన్యాసం



"రాష్ట్రపతి చెవిలో మధ్యంతర ఎన్నికలకై వామపక్షాలపోరు ప్రారంభమైంది"

పుచ్చుకున్న శ్రీ మొరార్జీని ఆహ్వానించి "మీ సంచిలో పాముల్ని బయటికి తియ్యండనాలా?" లేక "కొత్తగా" నాదే ప్రధాన ప్రతిపక్షం" అని - ఒక వంకక్రయిప్ చేస్తూ యిన్నాళ్లూ అధికారంలో వున్న అసలు జనతాపార్టీ కూడా మాదేనంటూ కోర్టుకెక్కిన జనతా యస్- నాయకులు చరణ్ సింగ్‌గార్ని "కేకెయ్యడమా?" అన్న సంగతి రాష్ట్రపతిని యిరకాటంలో పెడుతున్న చిక్కు సమస్య! లౌక్యంగా లౌకిక రాజ్యాంగ వరంగా శ్రీ నీలంవారు యిద్దర్నీ బలాబలాలు చూపమన్నారు.

శ్రీ చరణ్ ప్రధానమంత్రి ఐనా రెండు కాంగ్రెసులూ- చెరో రెక్కా పట్టుకుని— చెరోవేపు లాగుతాయి కనుక ప్రభుత్వం అంటూ యేర్పడినా 'ప్రజల'ను పట్టించుకోగల శక్తి సామర్థ్యాలు దానికుంటాయని అనుకోడానికి అవకాశాలు దుర్బిణి వేసి చూసినా కానరావటం లేదు- మధ్యంతర ఎన్నికలకైనా— దేశంలోని ప్రధాన పార్టీలు "ఏకమై" "నిలకడగా" రంగంలోకి దిగితే అదే చాలు, దేశంలో పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థ నిలదొక్కుకోడానికి: అని యెందరో అనుకుంటున్నారు. అయోమయ స్థితి ఆందోళనకర స్థితికి మారకూడదనే అందరి ఆశ.

[ వీరాజీ—24–7'–79 ]

---

### కథలు

20.7.79 నాటి ప్రియ సఖి పత్రంతో వెలువడిన పత్రిక చాలా నీటుగా వుంది! ప్రచురించిన నాల్గు కథలూ బాగున్నాయి. ముఖ్యంగా పొరపాటు ఎప్పుడుంది కథ వాస్తవానికి దగ్గర్లో ఉంది!

సీతా రామస్వామి, (ఖర్గపూర్)

* * *

ఆంధ్ర పత్రిక వారపత్రిక 13—7—79న సంచికలో శైలుకథ చాలబాగుంది. రచయితను అభినందిస్తున్నాను. అలా ప్రయోజనాత్మక, శిల్పవిలువలున్న కథ ఇటీవల సంవత్సరంగా వెలువడలేదు. ప్రేమకు ఎందరో ప్రేమ పొందలేరు... కాని సంఘ మర్యాదనుబట్టి సంయమనంతో వుండవలసి వస్తుంది. రచయిత సమగ్రంగా చిత్రించిన కథలో గొప్ప సత్యాన్ని, ప్రబోధాన్ని, తెలిపారు.

తిరుమల రామచంద్ర (హైదరాబాద్)

## ఉత్తరాలు

### సీరియల్

20.7.79 నాటి ఆంధ్ర పత్రిక వారపత్రిక ప్రియసఖి పత్రం ఎంతో అందంగా ఉంది. రంగరేఖలు సీరియల్ చాలా బాగా నడుస్తోంది. వళని సీరియల్ మొదట్లోనే ఎంత మనస్సుల్ని ఆకట్టుకుంది.

జె. బసవరాజు, డి.జె.లత, డి.వెన్నప్ప (పెలగ్గూరు)

* * *

ఇదిఒక పంథశాల ఈ వారంతో (13.7.79) అయిపోయింది. ముగింపు చదవగానే కళ్ళు చెమ్మగిల్లాయి. ఈ సీరియల్‌లో కథలేకపోయినా నన్ను కట్టుకుంది. హృదయంలోని శైలితో చక్కగా సాగిన ఈ సీరియల్ వెరైటీగా ఉంది. రచయిత్రి శ్యామల గారిని మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను.

కథలో ట్విస్ట్ బాగా ఉంది. ఉన్నా ఆన్నా చెల్లెలు చక్కని భావంతో ఉండటం వల్ల కథ బాగుంది.

ఐద్వాల రమేష్ (అనంతపురం)

* * *

వళని మొదట్లోనే చాలా ఆకట్టుకుంది. కథలో బంధుత్వం, పరిహాసం ఎక్కువుంది కథలు వారం చదివాను.

సం. పాపు మణిశేఖర్ కృష్ణ, (హైదరాబాద్)

* * *

వళని సీరియల్ చాలా ఇంట్రెస్టింగాయున్నది. ఈ వారం సినిమా పేజీ ఏమీ బాగా లేదు. కథలన్నియు బాగున్నాయి.

వై. రజని, వై. స్వర్ణలత, వై. కరుణ, (మంగళగిరి)

---

Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika Press, MallikariunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna.

మీ వెండి లాంటి, బంగారం
లాంటి మధురక్షణాలకు
అనుగుణంగా

# హెచ్ ఎమ్ టి
## గడియారాలు

మీరు స్త్రీ కాబట్టి మీకు తెలుసు. మీరు వెండి కావాలనుకోవచ్చు...కాని కొన్ని సమయాలు మాత్రం బంగారం లాంటివే.

మీ అభిరుచులు సాధారణమైనవే కావచ్చు కాని కొన్ని సమయాలు మాత్రం మరింత విశేషమైనవి అవచ్చు.

హెచ్ఎమ్టి వారికి తెలుసు.

మా స్త్రీల గడియారాల శ్రేణి, ఎప్పుడూ లేనంతగా ఉవ్విళ్ళూరిస్తోంది.

స్టెయిన్‌లెస్ స్టీల్...బంగారం... తెల్ల బంగారం. ఇలా ఎన్నో రకాల గడియారాలు గుండ్రటి, చదరపు ఆకారాలు గల గడియారాలు. కీ ఇచ్చేందుకు వీలైన, ఆటోమాటిక్ గడియారాలు.

ఇప్పుడు, మీకు కావలసిందల్లా ఎంచుకునేందుకు సమయమే !

హెచ్ ఎమ్టి గడియారాలు

* 17 మరియు 21 జ్యూవెల్స్
* పారాషాక్
* యాంటి-మాగ్నెటిక్



మార్కెటింగ్ డివిజన్




రాష్ట్రమునకు టైమును
సూచించువారు

మీకోరికకై నిరీక్షిస్తూ వుంటాం మాగడియారాల శ్రేణితో ప్రతిక్షణం